# శ్రీమదిన సుభద్రయ్యమ్మగారిచే
రచియింపఁబడిన

# తెలుఁగుకావ్యములు.

---

౧ భాగము.

---

వారి మేనల్లుళ్లయిన

శ్రీ రాజా గోడే నారాయణ

గజపతిరాయనింగారు సి. ఐ. ఇ.

వారివల్ల ఎడిట్ చేయఁబడి

---

శ్రీపరవస్తు శ్రీనివాస భట్టనాథాచార్య
లయ్యవారలుఁగారిచే

విశాఖపట్టణమున

ఆర్యవర ముద్రాశాలలఁ

అచ్చువేయింపఁబడి
ప్రకటింపఁబడెను.

1893.

[*Registered Copyright*]

*Printed by G. V. Jagannadhacharier at the Aryavara Press, Vizagapatam. 1893*

# Preface.

At the present time Hindu Girls are taught their own language in schools especially opened for them and ladies in Zananas. Also some generous European Ladies take interest in teaching Fine Arts to them. Yet it is a well known fact that the Antahpuras have furnished, both in ancient and in modern times, women of learning, who were not only Poetesses and experts in Fine Arts, but skilled in gardening also, so as to rear a plant, to facilitate blossoming and fruit-bearing and lay out an Udyanavana (a pleasure garden). This we learn not only from the poetry of Kalidasa &c. but by the Telugu Poets flourished in the Augustan age of Telugu Literature at the time of the great Krishnadevaraya, whose own daughter Mohanangi was the author of a beautiful Poem "Marichiparinayamu". About a hundred years ago Mangalagiri in Kistna District produced a Poetess by name Tarigonda Venkamma who has composed two books called Rajayogasaramu and Venkatachalamahatmyamu. There are other works may be mentioned composed by Telugu Poetesses as Molliramayanamu by Molli.

In looking into my Library, I have come across a Book of Poems written on

Palm leaves composed by an old member of my family. This Lady Sri Madina Subhadrayyamma was the eldest daughter of my grandfather. She was born in 1781 and was the mother of the famous M. Jagga Rao on whom one of the first C. S. Is. was conferred by Her Majesty for his services as a Principal Sudder Amin. He was well known to many European gentlemen of note. Like the mother of Sir William Jones this lady had brought up her son and educated him. She was well known for good works of piety and benevolence. The Poems disclose a deep reverence in Vyshnava religion and in one of her Poems she delineates upon morality. We now publish a selection of her Poems as Part 1.

They may be read with benefit by her sisters in the Telugu Country and perhaps with interest by Europeans who love to read Telugu Poetry.

Vizagapatam. 1st December 1893. } G. N. Gujputee Rao.

# అవతారిక.

ప్రకృతమందు హిందూబాలికలకు ప్రత్యేకముగా వారలనిమిత్తము స్థాపింపఁబడిన పాఠశాలలయందును రాణివాసపు యువతులకు అంతఃపురములందును స్వకీయభాష గఱపఁ బడుచున్నది. ఉదారులగు కొందఱు యూరోపియను స్త్రీలు వారలకు లలితములగు శిల్పవిద్యలను గూడఁ బ్రేమతో నేర్పుచున్నారు. కవితాశక్తియు లలిత శిల్పకౌశలంబునే కాక ఉద్యాన వనారోపణము భూరుహంబులఁ బెంచి పూపించుట ఫలింపఁజేయుట మున్నగు దోహదక్రియలు మొదలుగాఁగల వృక్షాయుర్వేద కృత్యములయందు నైపుణంబునుగల విదుషులు పూర్వకాలమునుండి నేటికిని అంతఃపురములందుఁ గలిగియుండుటయెల్లఱకుఁ దెల్లంబే. ఈయంశము కాళిదాసాదికృత ప్రబంధములవల్లనే కాక కృష్ణదేవమహారాయల యాంధ్రకావ్యోచ్ఛ్రియ కాలమందుఁ బ్రకాశించిన యాంధ్రకవుల ప్రబంధములవల్లనుగూడ మనకుఁ దెలియ వచ్చుచున్నది. ఆరాయలయారసపుత్రి మోహనాంగియను నామె మరీచిపరిణయమను మనోజ్ఞమైన కావ్యమునురచియించె.

దరిదాపు నూఱు సంవత్సరములక్రింద కృష్ణాజిల్లాయందలి మంగళగిరియనుపురంబునందు తరిగొండ వెంకమ్మయను పేరఁ బ్రసిద్ధురాలగు నొకవయిత్రి రాజయోగసారము వేంకటాచలమాహాత్మ్యము నను గ్రంథ ద్వయంబు రచియించె. మొల్లియనునాతిచే మొల్లిరామాయణము రచియింపఁబడె. ఈచొప్పున నాంధ్రకవయిత్రులచే రచియింపఁబడినగ్రంథములు విననయ్యెడు.

మద్గ్రంథసంభారమును పరిశీలించునప్పుడుమద్వంశజాతయగు శ్రీ మదినె సుభద్రయ్యమ్మచే రచియింపఁబడిన కావ్యములు లిఖించియున్న తాళపత్రి పుస్తకము నాకుఁ గానంబడియెను. ఈమె నా పితామహుని జ్యేష్ఠ దుహిత. ఈమె 1781వ సంవత్సరమందు జనించె. ప్రిన్సిపల్ సదరమీనుగానుండి రాజకీయ కార్య నిర్వాహమునకుఁగా మునుమున్న సి. ఎస్. ఐ. అను బిరుదాంకమును శ్రీ శ్రీ శ్రీ మహారాణీగారి వలనఁ బొందినవారిలో నొకరై ప్రసిద్ధికెక్కిన మదిన జగ్గారాయలవారికి తల్లి. ఈయన విఖ్యాతులైన యనేకులగు యూరోపియనుల పరిచయముగలిగి

యుండెను- సర్ విల్లియమ్ జోన్సు గారి తల్లివలె నీమె కుమారునిఁ బెంచి విద్య గఱపెను- ఈశ్వరభక్తిని పరోపకారమును బ్రకాశింపఁ జేయు సత్కార్యములచే నీమె ప్రసిద్ధి కెక్కెను. ఈమె రచియించిన కావ్యములచే నీమెకు వైష్ణవ మతమందు భక్త్యతిశయము కలిగి యున్నట్లు స్పష్టమగుచున్నది- ఈ ప్రబంధములలో నొకదాని యందు నీతి సవిస్తరముగాఁ జెప్పంబడినది- ఆ కావ్యములలో నుండి కొన్నిఁటి నిపుడు ప్రథమ భాగముగఁ బ్రకటింపుచున్నాము-ఇదియాంధ్ర దేశ మందలి స్త్రీలకు ఆత్మార్థముగాను ఆంధ్ర కావ్యములు చదువ నభిరుచిగల యూరోపియనులకు వినోదముగాను చదువ నుపయోగించును.

విశాఖపట్టణము.
విజయ సం॥ కార్తిక
బ॥ శుక్రవారము-

గోడే నారాయణ
గజపతిరాయఁడు-

# CONTENTS.



# విషయసూచిక.

శ్రీరస్తు

# శ్రీరామదండకము.

# SRI RAMA DANDAKAMU.

శ్రీమైథిలీచిత్త పంకేరుహేందిందిరా- చిత్త
భూసుందరా- కోసలక్ష్మాపరీ పాలకా- సూ
ర్యవంశాబ్ధి రాకా నిశానాయకా- యార్య స
త్పోషకా- భక్తనిర్వాణ సంధాయకా- వర్ధితా
నేక సంసేవకా- దైత్యగోత్రాటవీ పావకా- స
త్య సంకల్పకా- నిత్య సంతోషకా- దోష నిర్మూ
లకా- దూషణోత్సారకా- దుష్టదోత్సారకా- ధ
ర్మ సంస్థాపకా- ఘోరసంసార నిర్మోచకా- స
ర్వ లోకావళీ వ్యాపకా- శర్వపత్నీ శుభ ప్రాప
కా- దేవతోద్దీపకా- భావజారాతి కోదండ వి
ధ్వంసకా- తాపవిక్షేపకా- భూపక్షేపకా-
కుంభి సంరక్షకా- కుంభినీనాయకా- వేదసంచా
రకా- ఖేదనిర్ఛేదకా- మోహవిచ్ఛేదకా- శత్రు
భిత్సాయకా- చంచరీకాలకా- మంజువాగ్జాల
కా- కోసలాధీశ సత్పుత్రికా బాలకా- వాలిసం
హారకా- వానరాధ్యక్ష చింతాసముత్సారకా-
వైష్ణవోద్ధారకా- రామ- ధారాధరశ్యామ- త్వ

ద్దివ్య చారిత్ర పవిత్రప్రభావంబు వాగీశ నాగేశ
భూతేశ వాణీశులైనన్ నుతుల్ సేయఁగా లే
రున్నా కుందరంబా- మదంతాపరాధన్- గడుం
జంచలాత్మన్- శుభాభావదూరన్- కృతార్యా
పకారన్- సదాఘోరదోషన్- మహారోష- నై
నన్- భవద్దివ్యలీలల్- సుధాసారముల్- సర్వ
లోకార్తి సంహారముల్- దీనమందారముల్-
నారదవ్యాస సంగీతముల్- లోకవిఖ్యాతముల్-
మహత్కృత ధ్వాంతమార్తాండ సాహస్రముల్-
కృత్స్నదుఃపర్తి సంతాపనాహిత్యముల్- దేవ
సంస్తుత్యముల్- నిత్యముల్- గాన- నామానసా
క్షింబునం బోచు మార్గంబునం బూని- నానేర్చు
చందంబుగా- సార సూనస్సుచస్త్రాలగా- మేలు
గా- దండకంబెంతయుం గూర్చి- త్వత్పాదపద్మం
బులర్పింతు- బ్రహ్మప్రసాదంబునన్ గర్వదుర్వా
సంప్రాప్త- రావణాఖ్యుండునున్- కుంభకర్ణుండు- నిం
ద్రాజిముఖ్యన్ సాధులన్ బాధనొందింపుచుండం
గ- నొక్కింత శక్యంబు గాకున్న- సర్వామరుల్
పద్మజుంగూడి- క్షీరాబ్ధి తీరంబునుం జేరి- యిం
పారఁగా సన్నుతుల్ సల్పి- త్వత్పాదరాజీవము
లొంగి- జోహారుగావించి- కీనాశ లోకేశు మ

ర్వ స్త్రనాధ్యంబముగ దెల్పి- సత్యవాక్యానుజ్ఞ గా-
వించియున్నంతలో- రాక్షసారాతులన్ ఘాతుకున్
సద్గుణోపేతులన్ లోకవిఖ్యాతులన్ బ్రోవఁ
గాఁబూని- నీవా దశస్యందనాధీశుపూఁబోఁడిగ
ర్భంబునం బుట్టి- కైకేయిపుత్రుండు సౌమిత్రి
శత్రుఘ్నులుం గొల్వఁగా- బ్రహ్మచర్యాశ్రమం
బొంది- బాల్యోచితక్రీడ గావింపుచుం సంగ-
గాధేయుఁ డేతెంచఁగా- రాఘవుం డేగి- య
మ్మౌనికిన్ మ్రొక్కి- తోడ్తెచ్చి- సింహాసనంబిచ్చి-
సేవించి- పూజించి- నీవేమి గాంక్షించి వత్స వాం
ఛితార్థంబు నర్పింతు నీకన్న- మోదంబు మాకుం
గ- మక్షిన్నతం బాపి మన్నించి- రక్షః కృతాతంక
ముం దీర్చి- నాయజ్ఞమున్ జన్నగాఁ గావు రక్షిం
ప- నాదిత్యవంశాబ్ధిరాకాసుధాధామ నిన్ రా
మునింబంపవే- యంచుఁ బ్రార్థింపఁ- దద్ధారుణీవ
ల్లభుండుల్లముల్ ఝల్లనన్- జిల్లపాటొంది పెం
పెల్లిదారుం గళం బెల్లఁగాఁ దల్లడంబందుచున్
రిచ్చపాటెచ్చఁగా- వే ప్రసిద్ధాగ్నులం బుచ్చి-
సందేహమున్ ఖేదమున్ మోదమున్ డెంద
మం దేవడిన్ సందడింపందరంబొందఁగా- హ
స్తముల్ ఫాలభాగంబునం జేర్చుచున్- వీలు

గా గోలనాబాలుఁ డాలంబులోఁ బ్రోడగాఁ డె
న్నఁదగ్గాతృయున్ దిట్టమై దట్టమై యొప్ప- దస్త్రో
పదేశంబులున్ తేవుగా- టీవిగా వైరులౌ భం
డనోద్దండులన్ ఘోరులన్ వీరులై తేయులౌ గె
ల్వఁగాఁ జాలునే- ఘోరబీరాసురా రాగముల్
గాంచదాఁ బెగ్గిలున్ డింభ కుండయ్యయే- హాయ
ము రాబాయ నందాఁకనే డయ్యఁగా నంతటింగం
టి- హా- రాముఁడే జ్యేష్ఠుఁడౌ రాముఁడే కీ
ర్తి విస్తీర్ణుఁడౌ- రాముఁడే శౌర్య సంపన్నుఁ
డౌ- రాముఁడే వంశ వర్ధిష్ణుఁడౌ- రాముఁ
డే దైవమున్- రాముఁడే జీవమున్- రాముఁడే
సర్వ- మీబాలచూడామణిన్ ఘోరదైత్యాజి
కింబంపి యేలీల నేనోర్తు- నప్రాణముల్ దేహ
మున్ బాయ జే- యుంచు విలాపించి రూపంబు
నిర్జించు నారామచంద్రున్ బ్రభాసాంద్రునిం
బంపనే నిల్వఁగాఁ జాల- సంగ్రామ చాతుర్య
లన్ శౌర్య ధైర్యాధికాంచద్యశో ధుర్యులన్ జో
దులన్ బెక్కు-గా నొక్క యక్షౌహిణిం గొంచు
నే వచ్చి- నాయుక్తి చందంబు నంబూని- గూఢాసక్తి
గాఢశక్తిగా యాగమున్ సాము రాకంబు గాఁగా
ను. నాసూనుఁ గారుణ్యదృష్టిన్విలోకించి కావ

బుఱ్ఱవెల్లించి రక్షించు-మంచున్ మహాదీనతన్ వేఁ
డు భూనాథునాలాపముల్ వీనులం జూఁడినప్పై
న- గాధేయుఁడాజ్యాహుతిన్ గొన్న సప్తార్చి
చందంబుగాఁ గోపదీప్తాస్యుఁడై- నీదుసత్యోక్తి
మాధుర్యమున్ గోచరంబయ్యె, నేనే గదన్, బు
త్త్రునీవున్ సుఖంబుండుఁడన్నన్-భయభ్రాంతుఁ
డై- దేశికుం డెంతయుం దన్నుబోధింపఁగాఁ దే
ఱి, సందేహముందీఱి, సంతోషముమ్మీఱ- నారా
జు నిన్నున్ సుమిత్రాసుతున్ నెయ్యమున్ దియ్య
మింపారఁగాఁ జీరి- తత్సంయమిం గూర్చి వేఁబం
పఁగా- సార్ధమా యోజనంబేగి యక్కాననలోఁ
బూర్వవృత్తాంతమున్ దెల్పుచున్- దాటకా వృ
త్తముం జెప్పి వేదానిపైకోపుగా నీకుఁగోపం
బుదీపింపఁగాఁ జేసినన్-చౌరమహాచాపమందె
ఱ్ఱ సంధించి తన్మార్గ్వి మోహింపవే- తన్మహా
నిస్వనంబట్టి దిక్కుంభికర్ణాంతరంబుల్ పయో
రాశిగర్భంబు లోకాంతరాళంబు నాపక్రియా
ళాది రంధ్రంబులున్నిండ-నారించి పాదాహ
తిన్ భూమిఁగంపింపఁదబ్బిబ్బుగా బొబ్బలం బెట్టు-
చున్వచ్చి తామాయగాఁ బ్రమాయించవే- తా
టకన్ సూటిగాఁ గూల్పవే- శాపమం దెంతయున్

సంతసం బందుచున్ దాఁ బ్రయోగోప సంహార
యుక్తంబుగా సర్వ శత్రుఘ్న శస్త్రాస్త్ర సం
ఘాతముల్ దివ్య బాణంబులర్పించఁగా - వాని
చే సన్నియుండంగాంచి - తన్మార్గమందేగి తత్కౌ-
శికావాసమైయొప్పు సిద్ధాశ్రమస్థానమున్ జొ
చ్చియున్నంతలో - నెక్కుడౌ మక్కువన్ మౌని
కిన్ మ్రొక్కి - యోతాపసగ్రామణీ భక్తరక్షామ
ణీ దీక్షతోనుండవే - దక్షతన్ యజ్ఞవిఘ్నంబు
గావించు వా రాక్షసాధ్యక్షులం దత్క్షణంబం
దునే శిక్షఁబొందింతు నేనంచు మీరానతీయంగ-
గాధేయుఁ డాదిన్నమున్ దిన్నగా మంత్రతం
త్రమ్ములంబూర్ణమై యేర్పడన్ దీర్చుచుండంగ-
నేవరాత్రమున్ నేత్రముల్మూయకుండంగ మీరే
పుగానోపికన్ చాపముల్లోపుగాఁ దాల్చి మూ
డున్ మఱిన్ మూడుపూటా రాత్రముల్ గూ
గముగా రాగమొప్పంగ రక్షింప - నేతెంచి దట్టం
బుగా నంతరిక్షంబునందుండి నక్తంచరాధీశ్వ
రుల్ రక్త వర్షంబు వర్షించి యార్వంగ - నీవో
ర్వఁగాలేక - యత్యుగ్ర వాతూల బాణంబునన్
తొలచె నీచమారీచువక్షంబునందేయఁగా - వా
రి వాఁ డంబుధింగూల - దోర్వీర్యున్ సుబాహు

స్వాహాబాహాగ్రహా వోత్సాహు సంగ్రామ రం
గంబునం దుగ్రించవే- తకీర యున్నట్టి దైతేయు
లన్ దిక్కుల్ తేకుండఁగా చూక్కలై వ్రక్కలై
ప్రుక్కలంగాఁ జేయవే. మన్ననన్ జన్నమున్
గావవే- కౌశికుం డెంతయున్ సంతసంబంది-
నీవా విదేహ క్షమాజాని గావించు యాగంబు
నీక్షింప రామన్న మాతోడ రమ్మన్న. హర్షించి
రయోగ్రంబులం గూడి యే తేరఁ-గాంతాగమార్గం
బులో శాపసంతప్తయై రాతిరూపంబుతో నున్న
యగ్గౌతమ ప్రేయసిన్ పాదపద్మోల్లసద్ధూళి
యడన్ హాళిచేదుష్కృతధ్వాంతమున్ లోకవిఖ్యా
తిగాఁ బ్రీతిగాఁ బాపిరక్షింపఁదచ్ఛాపనిర్ముక్తిచేఁ
బూతయై నాతియై నిన్నుఁ బూజింప-నీవంత నమ్మా
నిచేదారిలో సాగసద్యాత్రలాలింపుచున్- య
జ్ఞవాటంబు ఖల్ సూటిగాఁ బాటిగా నీటుగా
నేటుగాఁ జేరఁగాఁ బోయి- యచ్చో నముద్దా
మమై భంజనోద్దండమై యొప్పు నాభీము కో
దండమున్, చండవేదండ మిక్షుప్రకాండంబు
దాఖండముల్ సేయు చందంబునం, దండిగా నిం
డుగా మెండుగా బెండుగా రెండుగాఁ దుండి
యల్ సేసి- లోకైక విఖ్యాత చంచద్గుణవ్రాత

భృంగాలకోపేతపూతన్ జగన్మాతసీతన్ మహీజా
తనుద్వాహమై- సోదరుల్ పెండ్లి కూతుళ్లతోఁ
గూడి మీ వెంటరా- నేగుచో- భవ్యవారిత్రుఁడై
రేణుకాపుత్రుఁడై యుప్పరాశుండు రా- నమ్మ
హాపెరు చాపంబునం దెక్కు సంధించి బాణంబ
రింబూన్చి తత్పుణ్యలోకంబులన్ లావుచేఁ బో
వఁగా నేసియున్- సర్వగర్వంబు వర్జింపఁగాఁ జే
సియున్- శాయనూదాఁగ్రమున్ నాయకమున్
గల్లు సీదాయలున్ కాయలున్ జోదులున్ గొ
ల్వఁగా నేగి- సిద యయోధ్యా పురావాసివై
సంతతోల్లాసివై యుండఁగా- నంత కామయ్య
గన్నయ్య రామయ్య, మాయయ్య నిన్ గూరి
మిన్ జేరఁగాఁ జేరి- నేదాన ధర్మాములున్ సద్వ్రి
తాచారముల్ చాలఁగావించి- తల్పైన దాఁ బెన్ని
ధింగన్న చందంబుగాఁ, బ్రేమచే రామ నిర్గంటి-
నీసర్వ సర్వంసహా మండలీభారము న్నితు న
డ్పించెదన్, బూనవే పుత్రి- నానేత్రముల్ చల్ల
గాఁ జూచుచున్ నిర్భరత్వంబుచే సౌఖ్యముం
జెంది నే ధన్యతన్ జెందఁ, బత్నీసమేతంబుగా
నేడు పుణ్యోత్సవ వాహంబు గావింపు- మెల్లుండి
పుణ్యాహ మోసట్టి నాడే భవత్పట్టమున్ గట్టె

దన్ప్రమట్టుగానుండవే, పోయిరమ్మంచుఁ బంపం
గ-మంత్రుల్లరంబొప్పఁగాఁ దత్పురంబెల్లరమ్యం
బుగావింపఁగాఁ జారులంబంపఁగా, వారునాచొ
ప్పుగా నొప్పుగాఁ జేయుచున్నంతః- గైకేయి
కిన్ దాసియై దాసిగానుండు నామంథరాభిఖ్య
తానొక్క సౌధంబుపైనెక్కి, నిశ్శేషవాద్యాళి
ఘోషంబులన్ వారయోషాది నాట్యాదులం
బెంపుగా నొప్పు నయ్యుత్సవంబెల్ల నీక్షించి- పా
దపరిహారంబుచే నైనయీర్ష్యారసంబెచ్చఁగా,
నచ్చుగా రామపట్టాభిషేకోత్సవంబంతయున్వి
ఘ్నమున్ జేతు నేనంచుఁ దాఁ బూని- కైకేయి
కింబట్టుగాఁ గట్టిదుర్బుద్ధి బోధింపఁ- దత్కాంత
యున్ మంతనంబందు వక్కాంతునిం జేరి- యీ
రేడువర్షంబులా రామునిన్ గానకుంబంచి నాసూ
నుని న్మానుగా ధాత్రికిన్ రాజుగావించి, మున్నా
కు నీఁబడ్డదై మీయెడన్ మద్వినిక్షిప్తమై యున్న
దా నవ్వరద్వంద్వ మీ చొప్పుగా నొప్పుగావిం
చి, నాకోరికల్ దీర్చవేయంచు, భూనాథునిన్వేఁ
డ- నాజాడ మీకంతయున్ దెల్పఁగాఁ- జాల
హర్షించియున్- సర్వభూపార్హ్యా, రౌగింద్రవే
షంబులంబూని- మీతాతమాతాదులం జేరి పో

వింపవే. దానధర్మాదులన్ వేగఁ గావింపవే. తండ్రిసత్యంబు పాలింపఁ, గైకేయి వాక్యంబు చెల్లింప, సీతాసతీ సోదరుల్ గొల్వఁగా, నాగరుల్ రోదన ధ్వానముల్ సేయుచున్ వెంటరాఁ. దద్రవంబెల్ల నాలింపుచుం బోవ. భూజానియున్మానుగాఁ జేరుమీరంపఁగా. నొప్పగా ముప్పేరున్ మవ్వమాగ్యందనం బెక్కి, యెంతేనిఁ బెంపెక్కి, యొక్కింత దూరంబు వేంచేసి, చొక్కటమౌ వాటమౌ నేటితీరంబునన్ సూటిగా డిగ్గి. నిత్యక్రియల్ దీర్చి, సారంబులౌ నీరముల్ గ్రోలియున్నంత. నెయ్యంబుతోఁ బర్ణముల్ శయ్యగాఁ దీర్చి, సంసుప్తతం బొందునట్లుంచి. వెన్వెంట నేదంటగా వచ్చు తన్నాగరుల్ జాగరూకత్వమున్ బాసి నిద్రింపఁగా, వారలక్ష్మియుపాయంబునన్ బాయఁగాఁ గోరి, ధీమంతుఁడౌ నా సుమంత్రు న్నటాక్షించి. నీవిరథం బింక సాకేతమార్గంబునం బోవఁగాఁ జేసి, నేర్పొప్పఁగాఁ దప్పుమార్గంబునం దెచ్చి యందేరు దాటించు శీఘ్రంబుగా నన్న. నయ్యర్ధరాత్రంబునం దాతఁడాక్రీతిఁ గావింప. పాయాహ్న కాలంబునన్ జాహ్నవిన్ జేరి. ధీరున్ గుహున్ భూరిభక్త్యా

వహున్ గాంచి తన్మైత్రి భావించి· యంతన్ సు
మంత్రిన్ మహీకాంతునిం జేరఁగాఁ బంచి-
గంగన్ మహాపువృతవాత్రభంగన్ దగన్ దా
టనే· త్రోవలో నా భరద్వాజమౌనీంద్రు సేవిం
చి, సత్కారముల్ దీవనల్ పొంది, యమ్మౌని
రాట్ప్రజ్ఞతన్ జిత్రకూటాద్రియందుండ· వైదే
హికాంగూసమున్ జేయ కాకంబుఁ జీకాకు
జెందించి శోకంబు నొందింపఁగా, దీనమై నీకు
నకాకి మ్రొక్కం, దదీయాంబకంబుం బకచ్ఛిన్న
ముం జేసి రక్షింపవే· యంతమీతండ్రి దాఁబు
త్రిశోకంబుచేఁ గాయమున్ బాయ, నత్స్మేది
నీనేతకున్ బ్రేత కృత్యంబులం దీర్చి, కైకేయి
పుత్రాదులేతెంచి, తద్వార్తమీకంతయున్ దెల్పఁ
గా· వారలంగూడి నే లోకకాచారముల్ ప్రే
త కార్యంబులున్ దీర్చి యున్నంత· నిన్నంత
యున్ బ్రాజ్యసామ్రాజ్యమున్ బూనవేయం
చు, తద్భ్రాతృసంప్రీతిమీరంగఁ బ్రార్థింపఁగాఁ-
బాదలిప్పించియున్నీతి యుక్తంబులౌ మాట
లన్ మాటిగా వారలంబంచి· నే దండకారణ్య
ముం జేరఁగా· దానవుండొక్కఁడేతెంచి సీతాం
గనన్ గక్షమందుంచి త్వత్సన్నిధిన్ జేరఁగా వ

చ్చి బిట్టార్వఁగా- నోర్వఁగా లేక- కూ్రరాస్త్రి
ముస్వింట కంపించి దేవాపరాధున్ విరాధున్
వడిన్ వక్షమున్ గాడఁగా నేయ, వాఁడంత
టన్ బోళధాత్రీసుతన్ డించి యాభీలమౌశూల
ము న్వైవఁగా దాని ఖండించి బల్దావులైదింటిచే
మోవుగా లక్ష్మణుండేయఁగా, నంతమీయిద్దఱన్
మూపునన్ మోపుగాఁ దాల్చి- దైత్యాధముండే
గ, నౌరుర్రస్మాడిన్ నీవు నీతమ్ముఁడున్ వాని దీర్ఘ
మ్ములౌ బాహుదండంబులం దుంచి, వాటంబు
గా ధాత్రికిన్ నేటుగా దాటరే- వాఁడు భూ
మిస్థలిన్ గూలి, యచ్చేరువన్ గల్గు భూమిజ
ముల్ నుగ్గుగాఁ బోర్లఁగా, మీరు వజ్రప్రహారం
బులం బోలు పెన్ గుద్దులన్ జాలనొప్పింప, దై
తేయుఁ డౌద్ధత్యమున్మాని త్వత్ప్రస్తుతిన్ సిస్తు
మీరంగఁ గావింపుచున్- బూర్వమందేను గంధ
ర్వరాజేంద్రుఁడన్ గూ్రర కాజేర శాపంబుచే
నిట్టి రూపంబు బ్రాపించె- నీశాపనిర్ముక్తి మా
తాత నీచేతనేఁ బొందితిన్- తేయుజనద్వంద్వ పో
త్రోవలో నేగ మానీశ్వకుండౌకఁ డుండుండు-
నచ్చోటికిం బోవరే- హెచ్చుగా మేలు మీకిచ్చు
నం- చంతయున్ జెప్పి- నిశ్చాలత్మభావింపుచున్

రోజాచున్ జచ్చి వైయచ్చరుండై వేగన్ జ
న్న-నప్పుణ్యుఁడే చొప్పుగాఁ జెప్పినట్లొప్పుగాఁ
గానలోఁ జోద్యముల్ గాంచుచున్ మానసంబంగొ
ల్చుచున్ బోవుచున్-కుంభజుంగాంచి సేవించ-
నత్తాపసేంద్రుండు దీవించి మోదించియాలింగ
నంబారఁగావించి సన్మానితుం డార్ఘ్యపూ విందు
చేఁబొందుగాఁ దృప్తినొందించి,దివ్యాసియక్షీణ
తూణీరముల్ జాపమున్ బాణరాజంబులన్ వె
న్నెతో వెన్నెగానిచ్చి, నీవాంఛితార్థంబు నేనిచ్చె
దన్ గోరవేయన్న- మీకృత్ప్రపాలబ్ధిగన్నన్ మ
తేమున్న దిష్టంబు, మాకున్న వాసార్హమౌ కాన
నీవానతీయంగదే యందు మేముందు మన్నన్-
ముదం బంది గూఢాత్రికిన్ జేరువన్ గౌతమీ
నవ్యప్రాంతంబునన్ మఱ్ఱివృక్షంబు లైదుండు-
నందుండుఁ డన్నంత- నచ్చోటికిన్ బోవుచో మ
ధ్యమార్గంబునన్- భీకరాకారమౌ గద్ద నిన్ గ్రి
ద్దనన్ గాంచి- మీతండ్రికే చాలమిత్రుండ, నా
ఖిల శైలాటవీ దూర దేశంబుల న్నీరు సంచార
ముల్ సేయఁగాఁ గోరిన న్నీపునన్ మోచి గొం
పోయి మీకిష్టముల్ గల్పి భూపుత్రిక్గాపుగానుం
డేదన్, దుర్ఘటంబైన కార్యంబు,లెంతేనియుం

జేయుదక్షుండ నేనన్న- నీవాఖగాధీశ్వరున్ జా
లమన్నించి వీడ్కొల్పి- చాపంచవట్యున్నతంబొ
ప్పఁగాఁగాంచి- తత్ప్రతోస్వదరుంగాంచి- యోఁక్ష్మ
ణా పర్ణశాలం గడున్ వింతగా నింపు నిర్మించు,
కాంతారమందుండు కాలంబు సర్వంబు నిచ్చో
ట వర్తింతమంచున్, నిదేశింప- సౌమిత్రియున్
వాస్తుశాస్త్రోక్తమార్గంబునన్ దంటగా నందమా
మందిరంబుల్ వినిర్మింపఁగాఁదమ్మునింగౌఁగిటం
జేర్చి- సీతా సమేతంబుగా నెక్కుశాలన్నివా
సంబుగానున్న- సౌమిత్రి వేళొకట శాకన్ ది
టంబొప్పఁగా నీకుఁ గైంకర్యమున్ వేలు కా
ర్యంబులన్నాని జాగ్రత్తతిన్ సల్పుచుండంగ-నీప
జ్జకున్ నీటుగా నేటుగా గోటుగా గర్వ వాచా
టయూ నొక్కనైశాటి నిర్లజ్జయైవచ్చి- నీసోయ
గంబెల్లఁదాఁగాంచి మోహించి- నీపొందుగాం
క్షించితిన్ నీదువృత్తాంతమాద్యంతమున్ దెల్పి
నన్మన్మనోజాత కేళీ వినోదంబులన్ దేల్పు మ
న్నన్- దరస్మేరవక్త్రుండవై, యింతినేనద్దశస్యం
దనేశాత్మజుండన్ రఘూత్తంసుఁడన్ రాముఁ
డన్నాఁడ, నాతమ్ముఁడాలక్ష్మణుం, డీధరా పు
త్రి యస్మత్కళత్రంబు, నీవెవ్వ రే యన్న· నే

నాదశగ్రీవుతోఁ బుట్టువున్ జుప్పనాతిన్ ననున్
గూడవే, వియ్యమంచున్ ఖరుం డెంతయున్ మన్న
నల్ సేయు- తద్భాగ్యమూలంబు నన్నెన్న
గా మించితిన్, రామ తత్ప్రేయసిన్ బాసి బల్
నెయ్యముం దియ్యమున్ దోఁప నన్ గూడి నీవుం
డు, మీ చేడె నీకీడుగాదింతటన్ వీడుమా, నేను
నీకున్ దగున్ మంచి యీడైన జోడౌదు, నీదార
యాకారమున్ నీకునన్నీరునా గోరునం గేరునే,
యుద్ధురాచార దుర్గత్వ శోపేత యా మైథిలిన్
మ్రింగి నీ యిచ్చకున్ వచ్చు నట్లిచ్చగా గచ్చగా
హెచ్చగా బంధభేదంబుల న్మన్మథ క్రీడలం దే
ల్చి చొక్కింతుఁగా, నైపుణింజూపనిచ్చోటఁ జో
టేమియున్ లేదు, నీ తమ్ముఁ డిందుండె నా యన్న-
హాసంబు భాసిల్ల, నత్యంత మీయింతి కేఁగూర్చె
దన్, నీవు నన్ బొందిన న్సౌఖ్యముం జెందఁగా లే
వు, నాపొందు కోకెందు, కాసుందరాకారునిన్ ధీరు
సౌమిత్రి నింపొందఁగాఁ బొందవే మైత్రిచెన్నొంద
వానంద మొందించు నిన్నందు బొమ్మాంచు నమ్మించి
నన్-సిగ్గుతో జగ్గుగాఁ జేరఁగావచ్చి-యోలక్ష్మణా
నీవు నాథుఁడవై కామసంతాప సంహర్తవై బ్రోవ
వేయన్న-యాసుందరీమోసముం జెందె తద్వచ్చ

లన్ వాని ధాత్రీస్థలిం గూల్చి- సీతాసతీలక్ష్మ
ణుల్గొల్వఁగా నెమ్మిసోమండుఁగాఁ- బజ్జైఱకంఠుం
డు నిండోలగంబున్నచో- శకఱసుం డొక్కఁడే
తెంచి దండప్రణామంబుఁగావించి-యో దేవరా
దండకారణ్యసీమన్, బ్రచండోగ్రతూణీరధా
రుల్ మహోదారశూరుల్ మహామేరుధీరుల్
జటాధారులౌ రాకుమారుల్, వరారోహ యౌ
నొక్క నీరేజపత్రాక్షితోడన్, నిరాఘాట ధా
టిన్ బ్రవేశించి, యందిచ్ఛఁ గ్రీడించు నీ చెల్లె
లిన్ ఘ్రాణకర్ణంబులం జెక్కు, పేరుక్కునన్
బెక్కువేల్ రక్కసుల్ గొల్వ త్వత్సోదరుం
డౌ ఖరుం డాజికిం బిల్వ- నవ్వీరులం దొక్కఁడే డ
క్కుమం డొంగఁ జెక్కాడి, రిన్నేలనిన్నేని వారో
ర్వఁగాఁ జాలి యున్నారు, త్వత్సన్నిధిన్ వి
న్నవింపంగ భీతావహంబౌ, నటంచున్ మఱిన్
గొన్ని దుర్బోధలం దీర్చినన్- గ్రోధ తామ్రా
స్యుఁడై, కొంతసేపెంతయుం జింతతో ఖేదమో
దంబులం జెంది- తానొక్కఁడున్ సింధుతీరంబు
నన్ దాటకాపుత్రునిం జేరఁగాఁబోయి, మా
రీచుచేఁ బూజితుండై, దురంతార్తిచేఁ దూలు
చున్, విన్నవృత్తాంత మాద్యంతమున్ జెప్పి- నీ

నేర్పు దీపింపఁగా జానుఁగా జానకిం గూర్చవే
యన్న- వాఁడెంతయున్ వంతచే మంతనంబుం
దు నాచింత దప్పింప, నిశ్శంకగా లంకకు న్వచ్చి
యున్నంతఁ- దన్నెంతయు న్నిందగాఁ బంపుచున్
రక్తసిక్తాంగియై భిన్ననాసాశ్రుతుల్ చూపి- నీ
కీర్తిరూపంబు రాఁ గారణంబేమి, యీదుష్కృ
యం జేయఁగాఁ జేతు లెట్లాడెనే, యాతఁడె
వ్వాఁడు, పుల్సిసలుయ్యాల లూగంగ మాహిం
చె, వాఁడెంతవాఁడైన నేనంతకుం జేరఁ బంపిం
తు, నాద్యంతమున్ దెల్పవే యన్న- కాపట్య
మే పార, నోయన్న యాదిత్యవంశాబ్ధిసోముండు
రాముండు వైదేహియన్ భార్యయున్ లక్ష్మ
ణాభిఖ్యుఁడౌ తమ్ముఁడు న్వెంటరాఁ, దండ్రి వా
క్యంబునన్ దండకారణ్య సంచారులై యుండఁ
గాఁ జూచి- యీమూఁడులోకంబులందున్న కాం
తాళిలో రూపరేఖా విలాసంబులన్ మిన్నయై
యున్నయవ్వెన్నెలాడిన్ నినుం గూర్ప నేఁగోరి
కన్ వారి కన్బ్రామి తోడ్తేరఁగాఁ- దమ్మునింబం
పె నన్నిట్లు గావించె- నీ వైభవం బెల్ల సాఫల్య
ముం బొంద నవ్వారిఁ గందెచ్చి కేళిగతిం గూడ లే
కున్న గర్వద్వైర్య దోర్వీర్యముల్ నిష్ఫలంబుల్,

త్వదీయోరు సౌభాగ్యముల్ వృద్ధి, యం దెంత
యున్ మాటలన్ గామమున్ బ్రేమయుల్ మ
త్సరం బెవ్వఁగాఁ జేయ; నద్దాన వేంద్రుండు
దాఁ గ్రక్కరన్వప్పు- మారీచుఁ బ్రేమన్ విలోకించి,
యూత్మాభిలాషం బెఱింగించి ప్రార్థించె- మున్
రాము బాణాహతిన్ నొచ్చియున్నట్టి నేనెట్లు
దేనేర్తు, నయ్యాదినారాయణుండిట్లు మర్త్యాకృ
తిన్ రాముఁడై పుట్టె, నాఁడాదిలక్ష్మీస్వరూపం
బె సీతామహాదేవియై, నీజగన్మాత నాభూతధా
త్రీతనూజాత నోతాత నీభ్రాంతి దూల గ నీరీతిఁ
గాంక్షింపఁగా నీతి గాదంచు నేతీల మల్లించి
నన్ బోకదిగ్బంధమున్ జేయ- నాతండు మా
యూక్షుగంగాకృతిన్ బూని, బంగారపున్ మేని
రంగుల్ విడంబింపఁగాఁ, బూతయై సీతకున్
దృష్టిమార్గంబులోఁ జూపటుల్ దంగుగా వంగు
చున్ పొంగుచున్ చెంగునం దాటుచున్ నిల్వ-
వైదేహి తద్దేహ సౌందర్యమున్ భ్రాంతిచే జూ
చి, యుష్మత్పదాంభోజమున్ గాంచి సేవించి,
యోరాజకందర్ప నాకోరికల్ దీర్చు మీ వేడినే
జాడనైనన్ దయం దెచ్చి యిమ్మంచు వేఁడన్, ధ
నుర్బాణముల్ దాల్చి, యచ్చోటికిం దమ్ముని

రక్షకై యచ్చట నిల్చి, యా లేడి నేజాడ
లన్ గూడఁగా లేక, బల్యాదికోలన్ బడన్ బ్రే
య- హా సీత హా లక్ష్మణా యంచు నిపలుకు గాఁబ
లుకుచున్, పాతకం బెల్ల దూలంగ మారీచుఁడా
నేలపైఁ గూల- నీదార ఘోరారవ మాలించి తా
జాలిచే సోలి సౌమిత్రితో, మైథిలీ యన్న మీ
యన్న నిశ్చింత్వ, నేయాపదన్పొందెనో, వేగ నీ
వేగి దోడ్తేగదే యంచుఁ బ్రార్థింపఁగా- నమ్మవే
యమ్మ- యగ్యాపదుద్దారకున్ బొందవే యూ
పదల్, భ్రాంతవై తింతెపో- యన్న- నాయం
గనాకర్ణ్యకున్ దైవయోగంబుచే నిష్ఠురాలాప
శూలంబులన్ జాలనొప్పింపఁగా- లక్ష్మణుండో
ర్వలేకేగినన్- దక్షిణంబందు సద్భిక్షువేషంబు
తోఁ గాలగంభోధికుండై దశగ్రీవుఁడే తెంచి, నా
రాయణా యంచుఁ దత్పర్ణ శాలా బహిర్ద్వార
ముం జేర- భూజాత యింపూనఁగా నర్ఘ్య
పాద్యాదులన్ సత్యపుష్పాదిగా నెంచి యర్పింప
సంతోషితస్వాంతుఁడై యుండి, యద్దోషి దానా
త్మగామానలం బేర్చఁగా నోర్వఁగా లేక, రాకేం
దుబింబాస్య నీవ్యస్తమౌ త్వంతమం జెప్పవే యు
న్న- నేనెన్న వైదేహపుత్రిన్ దశస్యందనాభీశు

కోదండ ప్రోన్నగ్రజున్ - రామభద్రుండు మద్భర్త,
కైకేయి వాక్యానుసారంబుగా రాజ్యభారంబు
వర్జించి, తత్సోదరుండైన మా లక్ష్మణున్ నన్ను
దోడ్కొంచు కాకుత్స్థుఁడే తెంచి, యిక్కాన
నుండుండి వారిద్దఱున్ వేఁటకై యేగి, రొక్కిం
తకాలంబులో వత్తు రందాఁక నిందుండి తత్పా
జుం దృష్టినాంతంగ మీరర్థులన్నంత - దుర్మోహి
నై నిజాకారదోహి యేయింకొమ్మ యోమానవాధీ
శుతోడన్ దరిద్రింబులం బొంద నీ కేటికే, న
న్నుగామించినన్ భాగ్యసంపన్నఁగాఁ జేతు
నన్నంతలో - వీనులన్ హస్తముల్ చేర్చి - యో
రీ దురాత్మా నినున్ గూటసన్యాసివేషున్ మదీ
యాంధివాధుండిదేవచ్చి తీక్ష్ణేషుపాతంబు చేఁ
ద్రుంచఁ గామించెదన్ భాగ్యసంపన్నవై యే
ననన్ - చాన నన్ హీనుఁగాఁ నెంచి యిట్లంటివే,
పఙ్క్తికంఠుండ రక్షోధినాథుం డనంచున్ నిజా
కారమున్ జూపినన్ - వేపమానాంగియై మూర్ఛ
తో భూమిపై వ్రాలఁగాఁ - బాపినై లోకకం
టాపినై పొందుగా జానకిన్ పెందొడన్ జేర్చి
యాకారమారంబుగాఁ దేరుపైనెక్కి పొంపె
క్కి వే మిన్నునన్ జెన్నుగాఁ బిన్నగా సన్న

గాఁ బోవుచుండఁగన్- జగన్మాతయాసీతయున్,
శోకసంతప్తయై- నేఁపి దేహాత్మ జాతన్, దశస్యం
దనాఖ్యాన నీజానికిన్ గోడలన్, రాఘవేంద్రుం
డు మద్భర్త, రయుమర్త్య లోకేశులారా యమ
ర్త్యేశులారా ననన్ బ్రోవరే యంచు నెల్లెత్తి
శోకింపఁగా- నాజటాయుండు నాలించి పాలిం
చ నేతెంచి. తీవ్ర ప్రతాపంబు దీపింపఁ- గో
పంబు తాపంబెదన్ గ్రమ్మఁగా యమ్మగా తీవిగా
రావణుం దాకి-పాదంబులన్ దన్నుచున్ గోరు
లన్ జీరుచున్ ముక్కునం జెక్కుచున్, బక్షవి
క్షేప వాతాహతిన్ దూలఁగాఁ దోలుచున్,
బోరు ఘోరంబుగాఁ జేయ- దోషాచరేంద్రుం
డురోషంబుతోఁ దీక్ష్ణ కౌక్షేయమున్ బక్షముల్
ద్రుంగఁగా నేయఁ- నావ్రేటునన్ గ్రక్కునన్
ప్రక్కలై, ముక్కునన్నెత్తుఁ బెన్నెత్తురుల్ గ్ర
క్కుచున్, బ్రాణమాత్రావశిష్టంబుగా ధాత్రి
పైఁ బక్షినాథుండు గూలన్- ఘనస్యందనం బెక్కి-
సీతాసతింగొంచు నాకాశ మార్గంబునం బోవ-
నాతో ప్రవలోబుశ్యమూకాద్రి శృంగంబునం దేవు
రం గ్రీడగావించు కీశేశులంగాంచి, వైదేహి పైఁ
బుట్టకున్ మట్టుగాఁ జించి నెమ్మేని భూషావ

లిన్ గట్టిగాఁ గట్టి శాఖామృగాధీశ మధ్యంబున
న్నెవ- వేవేగ నక్తంచరాధీశుఁ డా లంకకున్
జాగి- తత్పట్టణాంతఃపురాశోక వన్యంతరాత్యం
త రమ్యస్థలిన్ డించి- భూజాతకున్ రక్ష గావిం
ప దైత్యాంగనారాజి నుండన్ నియోగించి- య
త్యంత చింతా పరితాంతరంగంబు తోడన్ వి
హారంబునం జేరి- యయ్యుక్తికిన్ వుం డకుంఠరం
గాత్మచే ధిక్కృతుల్ గాంచుచున్ బొంకుఁ
జుండంగ- నీవంతటన్ దమ్మువిం గాంచి- హాలక్ష్మ
ణా బుద్ధిమంతుండవై యుండి కాంతన్ వనా
న్తంబునం దొంటిగా నుంచి రా వచ్చెనా య
న్న- యన్నా పిపన్నావనాసన్న నన్నాత్రిశూఁబి
ల్చు నీ వాక్యమున్ బోలె శబ్దంబు పీతేర, నత్త
న్వ శోకాతురాత్మైయున్న- నేనెమ్మి దీపింపఁగా,
నమ్మ మాయన్న వాక్యంబు గా మాఁగటన్ జెందు
మన్నన్- భవత్సన్నిధిం దెల్పఁగా రాని దుర్వా
క్యముల్ బల్కఁగా, వీనులన్ సోఁకఁగా, నిల్వఁ
గా లేక, నేవచ్చినానంచు, నారాకతప్పంచుఁ-
దానెంతయున్ చింతతో విన్నవించంగ- స్త్రీవా
క్యముల్ నిక్కముల్ గా మదిన్నమ్మి రాఁగూడ
నా యంచు, దా విన్నవై కన్నులన్ బాష్పము

క్లిష్టుఁగా, వైన మీర్తిత సీతావియోగార్తి పా
ల్చేసె నన్నుంచు, నీవిట్టురా నెంటినెట్లున్నదో
యంచు, నుల్లంబులోఁ దల్లడం బందుచున్, వె
క్కు సందేహముల్ దోచినన్ మల్లడిం బొం
దుచున్ మెల్లనే వచ్చి- తత్పూర్ణశాలాంతరంబం
తయున్ వంతతోఁ గాంచి- వైదేహి లేకున్న- న
శ్శ్రునలో నెల్లెడన్ రోసి- ఐర్వాసటం జెంది-
ధాత్రీసుతన్ గానఁగా లేక- నయ్యంగనా రత్న
మాసక్తిగాఁ బెంచఁ బెంపొంది యున్నట్టి సా
రంగపోతంబు శ్రీతెంచు మార్గంబులోఁ గొం
తద వ్వేగి- తానందు దివ్యంబులౌ పుష్పమా
ల్యంబులం దారహారంబులం దెల్పి కీర్ణంబులై
యుండ నాడాడ నాజాడ నీక్షించి శోకాబ్ధిలో
మున్గుచున్- దానవుం డెవ్వఁడో యింతినీతోవ్రి
వఁ జౌర్యంబుగాఁ గొంచుఁ బోఁబోలు, నిం
కేటికీ పౌరుషం బంచు, భూమీస్థలిన్ వ్రాలి మూ
ర్ఛిల్లి, సౌమిత్రి బోధింప నమ్మూర్ఛ దేల్యొంది-
ఘోరాత్ముఁడౌ రాక్షసుం డింతిఁ గొంపోవఁగా
భానుడున్ బంచ భూతంబులున్ నిదర్శయన్
బాపచేతస్కులై యూరకే చూచుచున్నట్టి యా
కార్యవరం బంత్రయున్ బాయఁగా వీరలందున్రిం

చితేఁగాని కోపానలం బారునేయంచు, సత్పు
గ్రితన్ భూస్థలంబెల్ల బీటల్ వడన్, శైల వర్గం
బు లల్లల్లనాడన్, దిశల్ గంపముం జెందఁ, జు
క్కల్ ధరన్రాల, సబ్భానుసప్తాశ్వ ముద్భ్రా
న్తమైతూల, దిక్పాలకుల్ భీతులై యుండఁగా,
ఖండనో ద్దండమౌ చండకోదండ మౌర్వీ నినా
దంబు రోదోంతరం బెల్ల నిండన్ వడిన్ జేసి-
బ్రహ్మాస్త్రమున్ వింట సంధింపనూహింప- రౌ
ద్రాకృతింబోల్చు నీమూర్తి నీక్షించి, సౌమిత్రి
మైత్రిన్- బ్రశాంతుండ వయ్యున్ గృపాస్ఫూ
ర్తిఁ జాలించి యీలీల నీవిజగ త్క్షోభమున్ జే
యరా, దద్దురాచారు చోరున్ బరీక్షించి తత్పా
త్రిమిత్రాది వర్గంబు తోడన్ బదభ్రష్టుఁ గా
వించి ధాత్రీసుతన్ దోడితేవచ్చు, లోకంబులం
గావవే- యంచు బ్రార్థించఁగాఁ- గోపమున్
దాపమున్ బాసి, తచ్చాపమున్ డించి- యో
లక్ష్మణా మీఁదటన్ జేయు కార్యంబు నా కంత
యున్ జెప్పవే, యంచు మీరానతీయన్- వి
భో సత్యసంధుండవౌ నీకు మేలేయగున్- సం
ధియంజేటి, కిష్కింధ నేఁజోడుగా నేగ నచ్చోడియం
జూడనా, సర్వమున్ సాధ్యమౌ నన్న- నాచో

ప్పునం దోప్పగాఁ గొంతదవ్వేగి- యచ్చో మ
హోత్తుంగ శైలాకృతిన్ బక్షముల్ ద్రుంగి ధా
త్రీస్థలింగూలి నిట్టూర్పెగన్ దోపఁగా మూల్గు
చున్నట్టి పక్షీంద్రునిం గాంచి- కన్గొంటివే లక్ష్మ
ణా, జానకిన్ మ్రింగి యీ యధ్రిగాకారముం
దాల్చి యున్నాఁడు మూఢాత్మకుండ్వీని సంహా
రముం జేతు నేనంచుఁ- గ్రూరాస్త్రముల్ వే
యఁ బూనంగఁ- బక్షీంద్రుఁ డామాట లాలిం
చి, యావత్స్వవృత్తాంతముం దెల్పి, దే
హంబు చాలింపఁగాఁ- జాలదుఃఖించి- మీతం
డ్రికిం జేయు చందంబుగా, నాఖగస్వామి కం
దగ్ని సంస్కారమున్, గౌతమీ గంగ చేఁదర్ప
ణాది క్రియాకాండమున్ దీర్చి- యంతన్ జన
స్థానమున్ దాఁటి యొక్కింతదూరంబు మీరే
గ- నందొక్క నైశాటి యేతెంచి, సౌమిత్రి శి
క్షించి, హానంబు భాసిల్లఁగా సంగమాపేత చే
డాయ- నాసుప్రతుం డాదురాచార నాసా
స్తన శ్రోత్రముల్ గోసి మోసంబు నొందిం
చ- మీరచ్చట న్నిల్వకం జాగి- పేరొక్క చోఁ
గ్రూరకర్మానుబంధుం గబంధున్ మదాంధున్
భవ ద్భుజ ద్వేచ్ఛా వరుంధున్ సమాకర్ణనో

ద్వ్యక్త దోర్బంధు నేర్పాటుగాఁ జూచి- తద్దీర్ఘ
బాహు ద్వయిన్ దమ్ముఁడు న్నీవునుం జెకిర-
తొకిరంత శంకించి- ఖడ్గంబులంకించి తద్బా
హువుల్ ద్రుంచ- వాఁడక్షతం బాసి విజ్ఞానియై
వేఁడి, సౌమిత్రిచే నీదు వృత్తాంత మాలించి,
తాశాపముం బొందు చందంబు వినిపించి- మే
న్వీడఁగ దానిమీ రగ్నిసంస్కారముం జేయ
నేతొంటి దేహంబుతో నిల్చి మేల్గూర్తు నన్నంత-
నట్లొప్పగాఁ జేసి- యద్దానవాదిష్ట మార్గం
బునన్, రాఘవుని ముక్తసూర్యేందు లోనౌ, మ
తంగాశ్రమ స్థానమున్ జేరి- యందమ్ము నీం
ద్రాజ్ఞ మన్నట్టి యామ్మ గ్సమాలోకనేచ్ఛా ను
రంగన్ శబర్యంగన న్గాంచి- సద్భక్తిచే నామె
'గావించు పూజా విధానంబులం దృప్తులై- చం
పకాశోక పున్నాగ ముఖ్యావనీజాత జాతంబుచే
శింపు సొంపారు పంపా నదీ తీరముం జేరి- ర
మ్య ప్రదేశంబులో స్నాన సంధ్యాదులం దీర్చి
యున్నంతటన్- వాయుపుత్రున్ కృపాపాత్రు
నింగాంచి- యాతండు సుగ్రీవుతో సంధిగావిం
చి- న య్యుగ్రదీధి త్యపత్యంబును న్నీవు నన్యో
న్యవాక్యోపవాక్యంబులన్ ధైర్యమున్ జెంది-

హస్తంబు హస్తంబునం బట్టి- గూరింగవాద్యా
దులన్ సత్కృతుల్ సల్పి- యగ్నిం బ్రతిష్ఠించి
తత్సాక్షిగా ముఖ్యమౌ సఖ్యమున్ జేయ- సు
గ్రీవుం డవ్యగ్ర భావంబుతో నుత్తరీయార్ధ
ఖండంబునం గట్టి యున్నట్టి భూషావళిం గట్టి
గాఁ దెచ్చి మీకియ్యఁగా- నుల్లమున్ ఝల్లనన్
బెల్లుగా బాష్పముల్ రాల మూర్ఛిల్లి- సుగ్రీ
వు నమోఘోక్తులన్ మెల్లనే దేర్చి, శోకంబు వో
కార్చి- ధీరత్వమే పార, దుర్గర్వశీలిన్ యశ
శ్శాలి వాలిన్ గృపావాల నీవొక్క వాలమ్ముచే
నేలపైఁ గూలఁగా నేసి- కిష్కింధ కప్పట్ట మి
త్రాత్మజున్ రాజుఁగావించి- సుగ్రీవ నీవిచ్చటన్
దారయున్ దారయున్ గొల్వ సౌఖ్యంబులం
జెందుమా- యంచు మన్నించి, కారుణ్యదృష్టి
న్విలోకించి- నే నిగ్గిరిం గానలో వాన కాలంబు
వోఁ బుచ్చెదన్- రాజ్యమున్ బూజ్యమై యొప్ప
నీ వేలు- మంతన్ శరత్కాల మేతేర, నీ సేన
లన్ గూడి రమ్మంచు- మీ రానతియ్యంగ- నారీ
లగా నేగి, యానాటికిన్ రాక, స్త్రీకూట సౌ
ఖ్యంబునం జొక్కి, యక్కూట మిం దక్కి యు
న్నన్- మహీజా వియోగాగ్నిచే ఖిన్నులై వి

న్నానై యున్న నీవంతఁ గోపంబు దీపింప సౌమి
త్రిచే మిత్రజుం బిల్వనంపింప- నీయాజ్ఞచే నా
తఁడుగ్ర భీత చేతస్కుఁడై, యొకఁడగఁ జూచి
నన్ లెక్కఁగొనన్ మిక్కుటై యుత్కటం జొక్క
మౌ మర్కటాధీశ సైన్యంబులం గూడి, యుష్మ
త్పాదాంభోజముల్ గాంచి సేవించినఁ, జాల
హర్షింపుచుఁ- భూసుతా న్వేషణా ర్థంబున
వానరాధీశులం బంపుచో- భీతశత్రుఁ బ్రభా
విస్ఫురద్గాత్రుఁ గారుణ్య పాత్రున్ సుర స్తుత్య
చారిత్రుఁ గీశేశ సన్మిత్రు నవ్వాయుపుత్రున్ బ
వీత్రుం గటాక్షించి- యేలీల నేనిన్ మహోర్మీలు
గా వీలుగా నీవు ధాత్రీసుతన్ గాంచి- కాకు
త్స్థ సంతానముఁ, నాదు ప్రాణంబు, రక్షిం
పవే యంచు- రత్నాంగుళీయంబు వైదేహి కి
మ్మంచు మోహంపు వారాసి యుప్పొంగ నీవి
య్య- నయ్యుంగరంబున్ గరంబున్ బ్రమోదం
బుతో నుత్తమాంగంబునం దాల్చి- నిన్నాత్మ
లో నిల్పి సేవించి కీర్తింపుచున్- గోష్పదం బ
ట్లు వారాసి లంఘించి- నిశ్శంకలంకా మనోగర్వ
మున్ సర్వముఁ బాపి- యాలంకలోఁ జొచ్చి-
యారామ సీమన్ గృశీభూత శీర్ణాలకో పేత

మాలిన్యయుగ్వస్త్రసంవీత నక్తంచరీభీత సీతన్
జగత్పావనిం దర్శించి-యోయంమాత త్వద్భర్తయౌ రామ
భూనేతయున్ దూతనైక్యాతిగానుంటి నెమ్మిన్,
హనూమాఖ్య ధాముండ నమ్మా దయం జూడవే
యంచు నమ్మించి- యో దుష్టసంహర్త, నీవా
తనలన్ దెల్పి- సద్భక్తితో నుంగరం బానవాలి
చ్చి, యయ్యంగనా రత్నమున్ జాలనూరార్చి
మోదావహన్ జేయ- వైదేహి, యో యంజ
నాజాత నీవీ యభిజ్ఞానమున్ గొంచు వైదేహ
జామాత కిమ్మంచుఁ జూడామణిన్ రక్తితో నీ
య- నాసక్తితో నంది- తానప్పు డారావణా
రామముం దామసం బొప్పఁగా, నామ మా
త్రావశేషంబుగాఁ జేయ నూహించి- వృక్షం
బులం గూల్చి, పూఁదీగెలం ద్రుంచి, తత్పాలక
వ్రాతమున్నొంచి, ప్రాసాదముల్ సౌధముల్
మంటపంబుల్ బడం ద్రోచి, తత్తోరణ స్తంభ
మం దెక్కఁగాఁ- బజ్రికంఠాజ్ఞచేఁ బంచసేనా
గ్రగుల్ మంత్రిసూనుల్ దనుం దీక్ష్ణశస్త్రాస్త్ర
ముల్ గప్పుచుం దాఁకినన్- వారివెల్లన్ నిరా
యాసవృత్తిన్ విదారించి- యక్షున్ జయాపే
క్షు నక్షీణదోశ్శక్తిచే దక్షిణాధీశు వీక్షించఁ

గాఁబంచి - దేవేంద్రజిష్ణుకృన్మైవచ్చు బ్రహ్మాస్త్ర
బద్ధుండమునుంబోలెఁ దద్బంధమున్ జెంది - లో
కైక విద్రావణున్ రావణున్ గాంచి - న్యాయ
ప్రకారంబుగాఁ గొంత శిక్షించి - లంకాపురంబె
ల్ల నిశ్శంకగాఁ గాల్చి - వాలాగ్ని సంభోధిలో
నార్చి - భూపుత్రికిన్ మైత్రితో మ్రొక్కి - స
ర్వామరుల్ సన్నుతుల్ సేయ - నాకాశమా
ర్గంబునన్ వాయువేగంబుగా జాంబవన్ముఖ్యు
లంగూడి - స్వేచ్ఛాగతిన్ వచ్చి - యవ్వాయు
సూనుండు త్వత్సన్నిధిం జేరి, జోహారుగావించి -
వీక్షించితిన్ సీత సంచచ్ఛుభోపేత లోకైకమా
తన్ భవద్ధ్యాననేచ్ఛా సమన్వీతయై లంకలోనుం
డఁగా - న మ్మహీజాత సేమంబుతోఁ బ్రేమతో
రామ నీమోహనాకారమున్ భావమందుంచి,
త్వత్సేవకై ప్రాణముల్ నిల్పి, శ్రీరామ రా
మా యటంచెప్పుడున్ దేవ మీరాక గాంక్షింపు
చున్, ఖిన్నయై కన్నులన్ బాష్పముల్ మేను
లోఁ గార్శ్యమున్ జెందఁగం గేలు చెవ్వొమ్ము
లో దైన్యమున్ బాయకుండంగ, నక్తంచర స్త్రీ
ల మధ్యంబునన్ రోదనం బెప్పుడున్ మాన కా
హార నిద్రాదికం బేమియున్ లేక భూశయ్యపై

నుండి- రెండే నెలల్ నిందు నందాఁక నేజీవముల్ నిల్పెదన్- రాఘవుండంత రాకుండిన న్నిల్పలేనంచు- వేగంబుగా రావణుం దుంచు యత్నంబుతో మిమ్ము నచ్చోటికిం దోడితెమ్మంచు వాక్రుచ్చి- నా మ్రొక్కుగా మ్రొక్కవే యంచు, నన్నంపుచో నానవా లిచ్చె నంచున్- బ్రశ్నావంబు గావించి, పైకొంగులో యత్న పూర్వంబుగాఁ గట్టి యున్నట్టి యద్దివ్యరత్నంబు నీకియ్యఁగా, మన్ననన్ గన్నులం జేర్చి- యా నిస్తులంబైన సద్వస్తు చూడామణిన్ మస్త్రమం దక్కునన్ జెక్కునన్ మక్కువన్ దాఁపుచో మిక్కిలిన్ దుఃఖమున్ జెంది- కీశేశుఁడుం దమ్ముఁడున్ నెమ్మి మార్పాఁగా శోకమున్ వీడి- రామా తమ్ముఁడా నేను నాతమ్ముఁడు న్నీ ప్రభావంబుచేఁ గ్రిమ్మరన్ నెమ్మితోనుండఁగాఁ గ్లై- నాదిత్యవంశంబు రక్షించితీవంచు- నేదీనికి న్బారుగా నేమియున్ జేయఁగా నేరనీకున్- బరీరంభణం బిచ్చెదన్ జేర రమ్మంచు-న న్వాయుజుం గౌఁగిటం జేర్చి మన్నించవే- భానుసూను న్విలోకించి, నామానసం బెంతయున్ సంతసంబందె- నాశాకమధ్యంబునం జెంది యు

గాఁ జింతఁ జున్నాఁడు- నే డీముహూర్తకంబు
లో జైత్రయాత్రన్ బ్రవర్తిల్లినన్ వైరులం గె
ల్తు మంచున్- బయోరాశి తీరంబులో సేనల
న్నిల్వఁ బంపించుమా యంచు- నగ్గంధవాహాత్మ
జున్ వాలిజు న్నీవు నీతమ్ముఁడున్ లీలఁ, దా
ఋక్షోత్కరా డ్వ్యాహులౌ కేశవేశానులం బో
లి, పెంపెక్కఁగా నెక్క- సుగ్రీవనీలాది స
ర్వప్లవంగోత్తముల్ జాంబవన్ముఖ్య భల్లూకలో
కేశ్వరుల్ గొల్వ, దైత్యేశ్వరున్ గెల్వ, దండె
త్తి. మీరప్పయోరాశి తీరంబునన్ డిగ్గి యుం
దుండఁగాఁ- జూచి, దేవారిచారుల్ మన స్తుల్య
కంటారులై యేగి, తద్వార్త మందోదరీ భర్త
కుం దెల్పఁగా- హైన్యదైన్యంబులం జెంది- దైవం
బదెట్లుండు నట్లయ్యెడిన్, దానిఁ దప్పింప శక్యం
బుగా దంచు, ధైర్యంబు చేయూఁతగా వచ్చి-
యాస్థానపీఠంబునన్ నిండుగొల్వుండి- ధీమంతు
లైనట్టిసామంతులన్ న్యాయతంత్రజ్ఞులైనట్టి స
న్మంత్రులన్ గాంచి- యీ నాటి కిప్పాటికిం జే
టు వాటిల్లు నంచున్ గడున్ భీతి నానెమ్మదింబు
ల్కె- నీవింతల న్వింటిరే- స్వల్ప కాలంబులో మ
ర్కటుం డొక్కఁడే లెంచి, శ్రీదావనిం బాడు

గావించి, యుద్ధక్రియాదక్షు నక్షున్ జయా
పేక్షుండై యక్షతుండై యనిం గూల్చి- వాతో
వివాదించి, మత్పట్టణం బంతయున్ గాల్చి- సీతా
సతిం జూచి భాషించి, యంభోనిధిం దాఁటి, ని
ర్భీతుండై లోకవిఖ్యాతుండై పోయె- ధాత్రీజకై
మానవుల్ రాఘవుల్ భూరి శాఖామృగశ్రేణ
ప్రవీరోగ్ర సైన్యంబు లేకాగ్ర చిత్తంబులం దమ్ము
సేవింప, సుగ్రీవుతో నబ్ధి తీరంబునన్ డిగ్గి యు
న్నారు- వారాశి నేలీల నైనన్ వడిన్ దాఁటి వ
చ్చేగః- వారిందు రాకుండ వారింప, మీబుద్ధికిం
దోఁచు మార్గంబునన్ రాజనీతి ప్రకారంబు
నం దెల్పరే యన్న- వారందఱున్, దేవరా దీని
కై కొందలం బందఁగా నేటి, కిన్నరుల్ వాన
రుల్ దైత్యులం గెల్చువారే, భవద్భృత్యులం
దొకఁడే చాలఁడే వారలం బోరిలో గెల్వఁ
గా, నంత దుర్వార గర్వాంధులై ప్రేలు వా
రిన్ నివారించి- హస్తద్వయిం గూర్చి ఫాలస్థ
లిం జేర్చి, యకుంభకర్ణానుజుం డగ్రజుం
గాంచి, యోయన్న దుర్మార్గులౌ వీరిమాటల్
మది న్నమ్మరా, ధర్మహీనాయతుం దల్పుఁడా
చూడ, సన్మాని హృత్కాపటకం దాటకం దుంపఁ

డే, విద్విష ద్దుర్నిరోధున్ విరాధున్ విదారిం
పఁడే, పెక్కువేల్ రక్కసుల్ గోల్వపై వచ్చు
విరాధవీరున్ ఖరున్ జంపఁడే, మాయలం బన్నఁ
గాఁ జూచు మారీచు ఘోరాస్త్ర పాతంబునం
గూల్పఁడే యన్న, నమ్మేటి రామన్నతోఁ గం
టకంబేటికిన్- బ్రహ్మ వంశంబునం బుట్టి నీవన్య
దారన్ జెరంబెట్టియీనింద కిట్లోర్వఁగా నేల-
శ్రీ రామభూమీశుఁ డంభోనిధిం దాఁటి రాన
ప్పుడే, వానరుల్ యుద్ధసన్నద్ధులై యాత్రికూ
టాద్రి నుద్వృత్తితోఁ బెల్లగించే ప్రయత్నంబు
గావించ కున్నప్పుడే, లక్ష్మణాస్త్రానల జ్వా
లలన్ మేఘనాదాదులౌ పుత్రమిత్రాదులన్
మ్రగ్గకున్నప్పుడే, వేగనో భ్రాత సీతన్ జగన్మా
తఁ గాకుత్స్థ భూనేత కర్పించవే యన్న- దో
షాచరేంద్రుండు రోషంబుతోఁ దమ్మునిం జూ
చి- హాలాహలజ్వాలలన్ గ్రాయుచున్ నాలు
కల్ గీటు కాలాహితోఁ బొందు నీపొందు క
న్నన్ గడుమ్మేలు- నీరేజ పత్రంబునం దంబువు
న్నట్లు నన్ జెంది యున్నావు, నా పెంపుఁ జూ
పోపఁగా లేవు, దుష్టాత్మ, మారాడఁగా నోర్వఁ
గాలేను పొమ్మన్న- నాబంధుసంత్రాత నిన్ దా

తగాఁ జూతు నీవన్న నామీదటన్ రాజ వేష
న్నివన్నావు, నాకెన్నఁగా మన్ననే కాక వేఱు
న్నదే- దివ్యరత్నంబులుం దారహారంబులున్
నవ్య చేలంబులున్ భవ్యగంధంబులుఁ సౌర
భోపేత పుష్పంబు లత్యుత్తమాశ్వంబులు న్మ
త్త మాతంగముల్ భూమిజన్ గానుకల్గా స
మర్పించి, భూజా నిదర్శించి జోహారుగావించి,
మస్మందటన్ బ్రోవుమీ- వల్లగా కన్న శ్రీరా
మ దివ్యాస్త్రజాలంబు లేతెంచి త్వత్ప్రపా
త్రాది దైతేయసంఘంబు సర్వంబు ఖండించు-
నా బుద్ధి మన్నించు, నా పల్కు త్వచ్చిత్తమం
దుంచు, నేజాటివిన్పింతు. నీవెత్తఁగా లేని పం
చాస్యచాపంబు భగ్నంబుగావించె- కారాగృ
హాబద్ధుఁగా నిన్నుఁ గావించె నేధీరుఁ, డకార్
తవీర్యార్జున క్షోణిభృద్బాహువు ల్వేయు
ఖండించె నేవీరుఁ, డాజానుదఘ్నైక ధనుర్వే
దతత్త్వజ్ఞు నిర్జించె- వాలంబుచే వీలుగా నెన్న
బంధించి వారాశులన్ ముంచె నే కద్యశశ్శాలి,
యవ్వాలి సౌకర్యమ్మునన్ కీలగా నేలఁ గూలిం
చె- నీలంకనిశ్శంకతన్ గాల్చె నేనిర్జితారాతి,
యామారుతిన్ బంటుగా నేలె నేవానరాధీశుఁ,

జ వ్వానరాధీశు సుగ్రీవుఁ బెన్బంటుగా నేలె, నేరాను భూనాయకం- డాదురాధర్షుతో నీక్ష్య నీకేల- ధాత్రీసుతన్ గాన్కగా నిచ్చి- మాంసా పరాక్షం దయాయుగ్ధియా త్రాహి త్రాహి ప్రభో- యంచుఁ దత్పాద రాజీవముల్ గాంచి ప్రార్థించవే యన్న- నేత్రంబులం జిత్రభాను స్ఫుర ద్విస్ఫులింగంబు లెంతే విచిత్రంబుగా రాలఁగాఁ, దమ్ముని౦ గ్రూర దృష్టి న్విలోకించి, తద్వక్షముఁ దన్నఁగాఁ- దక్షిణంబందు భూమిస్థలిన్ వ్రాలి మూర్ఛిల్లి- వాలుగ్రీన్ గేల నంకింపుచున్ వేఁయ సంకింపుచున్ దగ్గరంబోవు నంతన్- బ్రహస్తుండు హస్తంబులం బట్టి ప్రార్థించి సింహాసనాసీనుఁ గావించఁగాఁ- గుంభకర్ణా నుజన్ముండు దెల్వొంది- యీలీలగాఁ గ్రోధ మాత్సర్యముల్ నీమనస్సములో నిండి యుండంగ ధర్మాను కూలంబులౌ వాక్యజాలంబులం దాదరంబుండునే మీకనన్- రాక్షసాధీశ్వరుం డాప్రహస్తాదులం బిల్చి, యీసంగరత్రిస్తు మద్వైరి పక్షస్థు నా స్థానముం దాఁటి పోఁజేయరే, యంచుఁ బంపించఁగా- రోసి యవ్వాసవారాతి తమ్ముండు శోకాకులుండై దశ

గ్రీవునింజూచి- నీబన్నముల్ దీర్చఁగాఁ జూడలే
కీ హితాలాపముల్ వల్కు, నీవల్కు నన్నింతగాఁ జే
యఁగా వచ్చునే- భాగ్యమున్ బ్రాణమున్
బాయు దుష్కాల మేతెంచ సత్కార్యముల్
దోచునే నీకుఁ- గోపంబు దీపింపఁగాఁ జేయు
నాపల్కు- ఘోరాజిలో నక్షహారాజు బాణా
ళిచే లుంఠితంబైన త్వత్సైన్యబృందంబు వీక్షించు
నాఁడేనియున్ మెచ్చవే- నేతవై యుండఁగా
నిన్ను సేవించు ప్రాప్తంబు చెల్లింది- హా వేయు
నింకేల, నేబోయెదన్, పుత్రమిత్రాది సంఘం
బుతో సౌఖ్యమున్ జెందవే యంచుఁ- గన్నీరు
ముక్తామణుల్ రాలుచందంబుగా జారఁగా దీ
ర్ఘుఁడై, మానుగా వచ్చి త్వత్పాద రాజీవముల్
గాంచి, హస్తాబ్జముల్ ఫాలభాగంబునం జేర్చి-
రామా ధనుఃపక్షా విపక్షైక హార్యక్ష నీరేజ మి
త్రాన్వయాధ్యక్ష శ్రీరమ్యవక్షా సితాంభోజప
త్రాక్ష యుద్ధక్రియాదక్ష, యేనద్దశాస్యానుజుం
డన్ మహాపాతకుండన్ భవద్దాస్యమున్ గోరి
త్వత్సన్నిధిం జేరఁగా వచ్చితిన్- నన్ను రక్షిం
చు కారుణ్యదృష్టిం గటాక్షించవే యంచుఁ,
దానంత వృత్తాంతమున్ దెల్పి, ప్రార్థించఁ

గా, దిక్కునన్ దగ్గరం జేరి- మీయన్న నన్నాజిలో
మాఱొంగ నన్ భీతుఁడై, వార్ధిలోఁ జొచ్చినన్
స్వర్గమున్ జేరినన్ సత్య లోకంబులో కేగి
నన్ వ్యోమమర్త్యంబులో డాగినన్, మామకా
మోఘదివ్యాస్త్రముల్ వెంటనంటించి యారా
వణుం దున్మించి- దైత్యాధిపత్యంబునీ కిచ్చెదన్-
వేయునింకేల, బ్రహ్మాదులంగూడి సన్నద్ధుఁడైవ
చ్చినన్, యుద్ధరంగంబులో నద్దురాచారు స్వా
మాత్య యుక్తంబుగా మృత్యువున్ గూర్పలే, కే
సమోఘ్యా పురిన్ జూడఁగాఁ గోరి నట్లైన,
మాతండ్రి పాదాబ్జయుగ్మంబు తున్ దప్పినట్లం
చు- హస్తంబు తన్మస్తమందుంచి, నిర్భీతుఁగా
వించి- సౌమిత్రి యు కుంభకర్ణానుజున్ లంక
కతన్ రాజుఁగాఁ బట్టమున్గట్టవేయంచు మీరా
నతియంగ- నాచొప్పగానొప్పగా నాచరింపం
గ- నీవంతవవ్వారిధిం దాఁట సర్వప్లవంగోత్త
మానీత శైలంబులన్ సేతుబంధంబు గావింప-
వా శైలముల్ గ్రుంగఁగాఁ గాంచి- కార్యేచ్ఛవా
రాన్నిధిం గూర్చి ప్రాయోపవేశంబుగా మూ
డహోరాత్రముల్ నిష్ఠతో సుష్ఠుగా నుండఁ
గా- స్వస్వరూపంబుతోఁ గంధి గన్పించకా కొం

డలన్ దండిగాఁ దేల్చకున్నన్, మదిన్ గ్రోధ
ముజ్జెందె- వారాన్నిధిం జూచి తే లక్ష్మణా, విం
తగా నాభయం బెంతయున్ లేక, యుత్తుంగరంగ
త్తరంగంబు లొండొంటికిం దాఁక, మిన్నంటఁ
గాఁ బొంగియున్నట్టి యీ బింక మింకింతు బా
ణాగ్నిచే- వేగఁ గోదండ మందీయవే- యంచు
విల్లంది, దుర్వార నారాచ జాలంబు లావార్ధి
పైనేయఁ- దత్సింధు చాలా భయంబంది యు
న్నంతఁ- గోపాగ్ని చల్లార్పఁగా లేక, బ్రహ్మో
స్త్రము న్వింట సంధించి, వారాన్నిధిం బ్రేయ
బూనన్- స్వదేహంబు గంపింప నావాహినీనా
థుఁడే తెంచి, త్వత్పాద కంజాత యుగ్మంబు ద
ర్శించి, తాహస్తముల్ రెండు జోడించి, శ్రీ
మచ్ఛుభాకార భక్తార్తి సంహార లోకైకవీరా
సదాచార సర్వాధికారా మహోదార యో
గీంద్ర చిత్తాబ్జ సంచార మోదీనమందార బ్రి
హ్మాస్త్రపాతంబు కేనెంత వాఁడన్, దయంజూచి
నా నేరమున్ గాచి రక్షించు- నీవేమి వైపించి
నన్ నీటిలో ముగ్గకుండఁగాఁ దేల్తు నేనన్నఁ-
గారుణ్యదృష్టి న్విలోకించి, నా యస్త్రరాజం బ
మోఘంబు, నేదీని నెవ్వారియందున్ బ్రయో

గింతు, నీవే దగం దెల్పవే యన్న- నాయుత్తరం
బును హాహాత్ములై సాధు సంతాపకృ త్తోగ్రు
లై దానవుల్ డాగియున్నారు, వారిమ్మహాస్త్రం
బుచే రూపఱుం జేయవే, యంచు నవ్వాహినీ
భర్తణ విన్పించఁగాఁ జాల హర్షించి- య
య్యుజ్జ్వలాస్త్రానల జ్వాల లాకూపార ద్రైతేయు
లన్నిఖుగాఁ జేయ నీవేయ. రాత్రించర వ్రాత
ముంజంపి, ధాత్రీస్థలిం దాటి పాతాళలోకంబు
లోనాటి, యయ్యస్త్ర మేతెంచఁగా- వాహినీ
నాథుఁ డావింతసన్ సంతసంబందుచున్, రా
మ నీలాంబుదశ్యామ దేవారికాంతార దావా
నలుండౌనలున్ ముందుగాఁ బంపి, యింపొందఁ
గాఁబొందుగా సేతువుంగట్టఁగా నాజ్ఞఁగావిం
చి, యాకట్టపై నేగి, నీ సేనలున్నీవు నీతమ్ముఁడుం
గూడి, బింకంబుతోఁ బొంకపాలంక సాధించి, వై
దేహి చేపట్టు, మన్నన్ ముదంబంది- సుగ్రీవనీ
లాంగదాదిప్లవంగేంద్ర సంఘంబులన్ జాంబ
వన్ముఖ్య భల్లూక యూథంబులం బంచి, నానా
మహాశైల వృక్షాళిచే సేతువుం బ్రీతిఁ గట్టించి-
యుల్లాసివై వాసిగా వారిధిం దాఁటి- శాఖా
మృగాధీశ సైన్యంబుతో లంకకున్ లగ్గవట్టిం

చి- దుర్మార్గసాలుర౯ దేవతాద్రోహులన్ సా
ధుసంతాపకృద్దుష్క్రియోత్సాహులన్ గోప
మాత్సర్యయుక్ప్రవృత్తిస్వ స్నేహులన్ నీల జీ
మూతసంకాశ భీకృద్బృహద్దేహులన్ దుర్యశ
శ్ఛన్నులన్ శౌర్య సంపన్నులన్, మేఘనాదాతి
కాయాకలా మాయులన్ వీర దైతేయులం గూ
ల్చి- క్ష్వేళా నినాదాప్త దిక్కుంభిరాట్కర్ణ
నిర్భేదనోద్దీప్త నకుంభకర్ణున్ వెసన్ ద్రుంచి-
దేవేంద్రసంప్రేషితస్యందనం బెక్కి- తేజంబు
రాజిల్లఁగాఁ జాలఁ జెంపెకి- యందేడ బాహా
రాత్రిముల్ నీవు లోకాపకారాంత మర్భావుఁడౌన
స్త్రశస్త్రితో నాటముల్ లీలఁగావించి బ్రహ్మాస్త్ర
పాతంబునన్ సాధు విద్రావణున్ రావణుం
గూల్చి- యవ్వాయుతంగాంచి- మన్ప్రియన్ నీవు
దర్శించి, నాగెల్పు చందంబు, నప్పట్టి కంఠాది
రాత్రించరుల్ లిబ నిర్జిత్రులైనట్టి చందంబునుం,
జెప్పిరమ్మన్న- నవ్వాయుజుండట్టు లద్దేవికిం దె
ల్పి యేతెంచి, వైదేహి సందేశమంబొందుగాఁ
జెప్పినన్- నీవు నకుంభకర్ణానుజుంజూడి- సీ
తాంగనన్ రంగగా మంగళ స్నాతఁగావించి,
సద్వస్త్రభూషాసుగంధానులేపాది కోపేతఁ

గావించి, రావింపుచూ యున్న నక్తంచరాధీ
శ్వరుం డేగి, యాలీల శృంగారమున్ గాంతలం
బంచి చేయించి, త్వత్సన్నిధిం జేర్ప - వైదేహి
తా నీదు నిర్మోహవాక్యాస్త్రజాలంబుచే ఖి
న్నయై, కన్నులన్నీరు మున్నీరుగా జారి వక్షో
రుహద్వంద్వమున్ జొంగ - హా నాథ నన్నిట్టియ
న్యాయముల్ బల్కుటల్ న్యాయమా నీకు, వై
దేహి పాపాత్మురాలంచు నీచిత్తమందుం దవద్దం
చు, నేచిచ్చునం జొచ్చి యేతెంచఁగా మెచ్చెదీ
వంచు - దీప్తాగ్నిలోఁ జొచ్చి సంశుద్ధురాలైన
చోఁ జేరి - సీతన్ జగన్మాత నశ్రాంతమున్ పూ
తఁగా స్వాంతమం దుంచవే యంచు - బ్రహ్మాది
రుద్రాము లేతెంచి ప్రార్థింపఁ జేపట్టి మన్నిం
చి - హా కారి సద్భక్తలోలా కృపాశీల నీ వేమి
గాంక్షించినన్ సంతసం బొప్ప నర్పించెదన్
గోరవే యన్న - నాకున్ సమస్తంబు పూర్ణం
బు, కోర్కుల్ మదిన్ గల్గ, వన్యైననొక్కింత
నే వేఁడెదన్, నానిమిత్తంబుచే వానరుల్ ఘో
రయుద్ధంబులోఁ జచ్చినా, రిత్తఱిన్ వీరిప్రాణం
బు లీవిమ్ము, శాఖామృగాధీశు లెంతున్న నం
దెల్ల వృక్షంబులున్ బండ్లతో నుండఁగాఁ, గంద

మూలాదులున్ స్వాదు నీరంబునుం గల్గియుం
డంగఁ జేయంగదే యన్న- నాతండు వాలీలగా
మేలుగాఁ జేయ- వైతేయబాణాహతిన్ గన్నకా
యంపు గాయంబులం బాసి భాసిల్లుచున్, వాన
రాధీశ్వరుల్, నిద్ర మేల్కొన్న చందంబుగా
లేవఁగా, సంతసంబందుచున్- పఙ్క్తికంఠా
నుజున్ బట్టి యాచన్ద్ర తారార్కమై యుండఁగాఁ
గట్టి- సీతాసుమిత్త్రాతనూజాతుఁ గూడి, సేనా
సమేతంబుగా, యక్షురాట్పుష్పకం బెక్కి-
భూజాతకున్ ద్రోవలో నాజివృత్తాంతముల్ దె
ల్పుచున్- జక్కనా పెక్కుదేశంబులున్ వాహి
నుల్ కానలున్ గోనలుం జూపుచున్ జాగి- వే
గన్ భరద్వాజ మౌనీంద్ర సాన్నిధ్యమున్ జే
రి, సద్భక్తిచే మ్రొక్కి- యయ్యంజనానందనుం
జూచి- యా కైకయీపుత్త్రు నీక్షించి, తద్భావ
ముం గాంచి, నా రాక విన్పించి రమ్మీవు పొమ్మం
చు వేఁబంపఁగా. నాహనూమంతుఁ డమ్మేటిద
ర్శించి, యుష్మత్కథాజాలమున్ లీలగా నంత
యున్ జెప్పఁగాఁ- జాలహర్షించి శత్రుఘ్ను
పేక్షించి, నీ వయ్యయోధ్యాపురంబెల్ల శోభిల్లఁ
జాలాపతాకాద్యలంకార సంపత్తి రంజిల్లఁ జే

యుంచుమా, యుత్సవం బెల్లెడన్ జాటఁ బంపిం
చుమా, సింధుబంధాది చిత్రంబు లెల్లన్ విచిత్రం
బుగా రాజువాగార మధ్య ప్రదేశంబులన్ వే
గవ్రాయించుమా, జానకీ మందిరం బెల్ల రమ్యం
బు గావించుమా- దుష్టుఁడౌ రావణుం ద్రుంచి
యేతెంచె మా రాముఁ, డెల్లుండి పట్టాభిషిక్తుం
డగుంగాన మీ రెల్ల రానర్హులంచున్, సమస్తావ
నీ నాథులం బోడి తెప్పించవే, యంచుఁ బంపింపఁ
గా- నాతఁడున్ వేగ సాకేతమున్ జెంది, తా న
ట్లు గావించి, సంప్రీతితో మాతలం జేరి, మీరాక
విన్పించఁగా- వారలున్ బంధు మిత్రాది భూ
మీశులున్ దోడరా, నుత్సవం బొప్ప శత్రుఘ్నుఁ
డే తెంచి, తత్సోదరుం గాంచి సేవించ- వారం
దఱుం గూడి యుష్మత్పదాంభోజముల్ గాంచి-
తత్సోదరుల్ మ్రొక్క దీవించి, మీ యంకపీ
ఠంబునం దుంచి మన్నించి- కౌసల్యకున్ గైక క
ట్లా సుమిత్రా మహాదేవికిన్ వేడ్క- సాష్టాంగ
దండ ప్రణామంబుఁ గావించి- వారెంతయున్
జేరి మయూరాంగ దీపింప నద్దీవనల్ సెంది- తత్పు
ష్పకం బక్కడన్ డిగ్గి పూజించి యక్షేశ్వరుం
జేరఁ బోఁ బంప- తానంతఁ గా నిష్టదైవంబులౌ

పాదుకల్ గొంచు నక్కైకయీ పుత్రుఁడే
తెంచి సేవించి- నీయాజ్ఞ నేనిత్య మీపాదుకా
ద్వంద్వముఁ బూజగావించి సేవించి, రాజ్యా
ధికారంబు నర్పించి, ధాత్రీతలం బెల్ల నేర్పొప్పఁ
గాఁ దప్పులేకుండఁ బాలించినాఁ డంచుఁ- దత్పా
దుకల్ దత్పదాబ్జంబులం గూర్చి భూభార మ
ర్పించి- యీ తాపసాకారముల్ వేగ వర్జించి,
భూపాల వేషంబుతో నిట్టి కీవేళ వెంచేయవే,
యంచుఁ బల్కంగ- గటాక్షించి. పైదోడులం గూడి,
యభ్యంగన స్నానమున్ లీలఁ గావించి- హేమాం
బరశ్రేష్ఠంబు లొయ్యారమింపారఁగాఁ దాల్చి,
వేసిష్ఠగాగోవ కస్తూరికాబొట్టొప్పగా దిద్ది, పాటీ
రపంకంబు నీటొంద మైఁబూసి, రత్నప్రభా దీ
పితంబైన యాకల్పముల్ పొల్పమీరంగఁ గీల్కొ
ల్పి- నందాత్ములై యిందు లందంద సేవింపఁ బూ
ర్వాద్రిపై నొప్పు పూర్ణేందుని బోలి యు
త్సన్నతంబైన తేరెక్కి- ముక్తాతపత్రంబు కై
కేయి పుత్రుండు పట్టంగ, సౌమిత్రి శత్రుఘ్ను
లత్యంత సంతోషిత స్వాంతులై భక్తితోఁ జా
మరల్ వీవఁగా- ముందటన్ వెనకఁ బార్శ్వ
ప్రదేశంబులన్ మానవాధీశ్వరుల్ రాతసాధీ

శ్వరుల్ వానరాధీశ్వరుల్ గొల్వ - నస్త్రానులున్ బ్రహ్మవిద్వాంసులున్ వాహనారూఢులై గూడి రా- వెంటఁగా సైన్యతో కేకయాధీశ పుత్రి సుమిత్రా బ్జపత్రాక్షులున్ కీశ కాంతామణుల్ వేడ్క నేతేర- సీతా సమేతుండవై బాగుగా నేగఁగా- వాంశికుల్ వైణికుల్ గాయకుల్ పాఠకుల్ మాగధుల్ భూసురుల్ వందిబృందంబులున్ సందడిన్ మంగళధ్వానముల్ సేయ- నత్యంత శృంగార భంగియుతాంగంబుఁ బొల్చు వారాంగనల్ నృత్యముల్ సల్పఁగాఁ బంచవాద్యమ్ములున్ మ్రోయఁగా- జాంబవంతుండు నీలుండు రంభుండు తారాదులున్ హేమవేత్రంబులం బూని, సొంపారఁగా భూసుర క్షత్రివిట్ఛూద్ర సన్మర్దనమ్మున్ బాపుచున్ బోవ- పుణ్యాంగనారాజి నీరాజనంబుల్ మహాభక్తిచేకర్తిచే నీయఁగా- రాజమార్గంబులో రాజసంబొప్పఁగా రాజబింబాననల్ గన్యహర్మ్యంబులందుండి లాజప్రసూనాక్షతల్ ముత్యముల్ చల్లఁగా- సర్వసైన్యంబుతో వైభవంబొప్ప సాకేతనుం జెంది- పట్టాభిషేకోత్సవ శ్రీలఁ జెన్నొంది- దుర్మార్గులం బట్టి శిక్షించి, సన్మా

గుణాలం గాచి రక్షించి - ధాత్రీజన వ్రాతమున్
బుత్రిసంఘాతమున్ గావిచారించి - వాతాగ్ని
నీరంబులున్ మీఱిరాకుండ వారించి - పృథ్వీస్థ
లిన్ స్వర్గ తుల్యంబుఁ గావించి - యాఱైదు
వేలేడు ఏకాధిపత్యంబుగా భూమి పాలించవే-
దేవ సంసార వారాశిలో నీదు నన్నున్ మదీ
నే సుభద్రియ్యనాసొప్పు దాసానుదాసిన్ గృ
పాదృష్టి నీక్షించి - త్వత్పాద కంజాత పోతం
బునం దుంచి - తత్కర్ణధారుండవై, నీదుము
ఖ్యాస్పదంబైన వైకుంఠమన్ పారముం జేర్చి-
రక్షించు రక్షించు - ధారాధరశ్యామ లోకాభి
రామా నతాబ్జాత భౌమా రమాకామ వైకుంఠ
ధామా సురారాతిభీమా రణోద్దామ భూపా
లసుత్రామ రామా నమస్తే నమస్తే నమః॥

శ్రీమతే రామానుజాయ నమః.



శ్రీరాములు.

శుభమస్తు. అవిఘ్నమస్తు.

---

# శ్రీకోదండరామశతకము మొదలగు వానిలోని పద్యములు.

# STANZAS FROM SRI KODANDARAMA SATAKAMU &c.

---

శ్రీవైష్ణవాంబుధిశీతకరుండన- ధారణిపైనవ
తారమొంది। చేతనరక్షణ సేయంగ మదినెంచి-
శ్రీవత్సగోత్రంబు సిరులు మించ। రామానుజా
చార్య రమ్యనామముఁ బూని- దాక్షిణ్య మొ
ప్పంగ దాసులకును। గురుపరంపరయును గు
దురుఁ దిరుమంత్ర- రాజము ద్వయమును గ్రమ
ముగాను॥ లలిత చరమార్థ మంతయుఁ దెలి
యఁజేసి। వనజలోచన భక్తుల మనిచినావు।
చారు వైశాఖపురధామ జగ్గరాయ। దాసహృ
దయాబ్ధిసోమ కోదండరామ॥౧॥

శ్రీవధూకామ రక్షితనతసుత్రామ- ధారా
ధరశ్యామ దనుజభీమ। పతితపావననామ భవ
నాశనోద్దామ- నవతులసీదామ భవుకసీమ। ని
హతఖలస్తోమ నిర్జితభృగురామ- శుభగుణారా

మ రక్షో విరామ। నిఖిలరాజలలామ నిగమను
త్సుతభూమ- యవనిజన్య హృదయాభిరామ॥
రాజదమరావతినాధరత్న ధామ। జలజభవ ము
ఖ్య దేవతాసార్వభౌమ। చారువైశాఖపురధా
మ జగ్గరాయ। దాసహృదయాబ్ధిసోమకోదండ
రామ॥౭॥

దశరథేశ్వర పుత్ర దానవకులజైత్ర- భక్తా
బ్జమిత్ర పావనచరిత్ర। పాలితరవిగోత్ర పాక
శాసనమిత్ర- సీతాకళత్ర రాజీవనేత్ర। నార
దస్తుతిపాత్ర నీరదనిభగాత్ర- ధవళాంశువక్త్ర
సంతతపవిత్ర। యాచితకౌశికసత్త్ర యాప్తభూ
రుహ శైత్ర- విద్విష తాటకానన వీతిహోత్ర॥
దారుణోదగ్ర దురితలతాలవిత్ర। భూరిధైర్య
నిరాకృతమేరుగోత్ర। చారువైశాఖపురధామ
జగ్గరాయ। దాసహృదయాబ్ధి సోమ కోదండ
రామ॥౮॥

సకలశుభాచార సన్మునిమందార- జలరాశి
గంభీర ఖలవిదార। భక్తార్తిసంహారక పాపావళీ
దూర- యతిమహోదార లోకైకవీర। శాంతి
గుణాగార సర్వవిద్యాధార- సుందరాకార
యానందపూర। దీనపోషవిచార దివ్యగుణోదా

ర- భూరిదయాపారపూర్ణ ధీర॥ ధీరమాకా
మినీ మణిచిత్తచోర। పంక్తిరథనామ మేదినీపతి
కుమార। చారువైశాఖపురధామ జగ్గరాయ। దా
సహృదయాబ్ధిసోమ కోదండరామ॥ ౪॥

సీతాహితాశ్లేష సింధుభీషణరోష- కలితా
ర్యజనఘోష లలితవేష। ఘనదయాపీయూష
కౌస్తుభమణిభూష- విరచితామరతోష విగతదో
ష। కృతవిద్వ దభిలాష ఖిన్నచేతనపోష- వితత
ఖలద్వేష చతురభాష। విదితసర్వవిశేష విహి
తవిప్రసంతోష- హాససుందరమోష పాపౌఘశోష॥
గురు మహిమాతిశాయి భాసురమనీష। గాఢనతమ
ర్త్య మోహాంధకారపూష। చారువైశాఖ పుర
ధామ జగ్గరాయ। దాసహృదయాబ్ధిసోమ కో
దండరామ॥ ౫॥

విదళితేశ్వరచాప విజితలంకాద్వీప- రవివం
శదీప తీవ్రప్రతాప। విదితశాస్త్రకలాప విహిత
వాయసతాప- కుసుమేషురూప తామసదురా
ప। శ్రుతిమధురాలాప కృత్స్నార్తి విలోప- క
రుణానదీప యక్షయకలాప। సజ్జననిక్షేప శ
త్రుభీకరకోప- కుటిలప్రతీప సద్గుణకలాప ప్రా
ప్తనరరూప హృతదానవావలేప। రాఘవత్యా

పయంచితామోఘరూప। చారువైశాఖపుర
ధామ జగ్గరాయ దాసహృదయాబ్ధిసోమ కో
దండరామ॥౬॥

రావణమర్దన రాజీవలోచన- మారీచసూ
దన మహితకదన। వాలివిధ్వంసన భూలోకపా
లన- పాపవినాశన రూపమదన। వారిధిబంధన.
వసుధేశనందన- సురనాయకావన సుభగవదన।
హరచాపఖండన హరివంశమండన- వరభక్తి
వర్ధన వనధిసదన॥ శార్ఙ్గముఖదివ్యసాధన స
రసహసన। మునిమనోనిత్య నివసనకనకవసన।
చారువైశాఖపురధామ జగ్గరాయ దాస హృద
యాబ్ధిసోమ కోదండరామ॥౭॥

దశముఖ ప్రతిపక్ష దైవతావనదక్ష- పాం
డవపక్ష శ్రీవత్సవక్ష। పరవీరమాతంగభంజనహ
ర్యక్ష- ఖరరూక్ష సంశ్రితకల్పవృక్ష। ఓనపోష
ణదీక్ష భానువంశాధ్యక్ష దళదంబుజాక్ష శీతల
కటాక్ష। ఘోరదానవశిక్ష కోపవిరూపాక్ష- ద
త్తదాసవిమోక్ష దానయక్ష॥ కలితమౌనిజనా
పేక్ష సరసిజాక్ష। విహితమకరాక్ష విహితభూ
విబుధరక్ష। చారువైశాఖపురధామ జగ్గరాయ।
దాసహృదయాబ్ధిసోమ కోదండరామ॥౮॥

దండంబు పద్మజాఖండలాది స్తుత- దండం
బు దానవదర్పదమన। దండంబు కృతకరి దైన్య
నివారణ- దండంబు శత కోటి తరణి తేజ। దం
డంబు పక్షిఖిన్న తాపస రక్షణ- దండంబు ప్రి
హ్లాదతాపహరణ। దండంబు కలశాబ్ధి తనయామ
నోహర- దండం బఖండ భూమండలేశ॥ వంద
నములీసుసనశాప వంచనీయ। ప్రేమఁ గైకొ
ని కరుణించు మోహనాంగ। చారువైశాఖపుర
ధామ జగ్గరాయ। దాసహృదయాబ్ధిసోమ కో
దండరామ॥౯॥

విఘ్ననాశనశక్తు విబుధారికులశిక్షు- విష్వ
క్సేనాధ్యక్షు విమత రూక్షు। సకలవిద్యాధుర్యు
సన్మునిస్తుత చర్యు- పరమ శారార్యుఁ బ్రస్తుతిం
చి। యతిరమ్య గుణసాంద్రు నభినవ చంద్రు- శ్రీ
నివాసబుధేంద్రుఁ జేరి మ్రొక్కి॥ రసికజనముల
మనముల రంజిలంగ। సీసశతకంబు వినుపింతు
చిత్తగించు। చారువైశాఖపురధామ జగ్గరాయ।
దాస హృదయాబ్ధి సోమ కోదండరామ॥౧౦॥

సీతాసతీనాథ సేవనీకాచరింతు- నేఁ జేయఁ
బూనిన నీదు కృతిని। మానుగా నవరస మాధు
ర్య గాంభీర్య- వాగ్గుంభనంబుల సరల జేయు।

వాక నీనామముల్ నాపలుకు దప్పవు. బాయం
గఁజేయు సుపర్వతటిని। తనయందు మునుఁగు పా
తకుల పాపంబుల- నపుడె పాయఁగఁ జేయు న
ట్టినంత॥ బుధులు మెత్తురుగద నిన్ను బొగడ నవ
ని। దుర్మతులు నిందసేసిన దోసమేమి। చారు వై
శాఖపురధామ జగ్గరాయ। దాసహృదయాబ్ధిసో
మకోదండరాము॥౧౧॥

గరుడ విద్యాధర గంధర్వచారణ- యక్ష కి
న్నరముఖ్యు లమరవరులు। సనకాది మునులును
సకల సత్క్రతువులును- నిఖిల లోకంబులు నిగమ
ములును। పద్మసంభవుఁడును పార్వతీశ్వరుఁ
డును- సురగణగురుఁడును సురగవిభుఁడు। నిన్ను
సన్నుతిసేయ నేరమితగురీతి- నాకు వశంబౌనె
లోకవంద్య॥ భవభయంబెల్లఁ బాయనో భక్త
వరద। తోచు క్రమమున నుతియింతుఁ దోయ
జాక్ష। చారువైశాఖపురధామ జగ్గరాయ। దా
సహృదయాబ్ధిసోమ కోదండరామ॥౧౨॥

పల్లవంబులమీరు పాదయుగ్మముతీరు- భుజ
గంబులను గెల్చు భుజయుగంబు। రాకేందు చెలు
వు నిరాకరించును మోము- కమలంబులను గేరుఁ
గన్నుదోయి॥ బంధుజీవచ్ఛవిఁ బరిహసించు మ

మోవి- కాంచనపుష్పంబు మించునాస| మద
నుని ధనుఃకాండంబు నదలకించును బొమల్- ముకు
రంబులను బోలు ముద్దుచెక్కు-॥ లందమగు నీదు
రూప మెల్లపుడు నామ| మానసంబున బాయ
దు మరువవశమె| చారువైశాఖపురధామ జగ్గ
రాయ| దాసహృదయాబ్ధిసోమ కోదండరామ॥

మత్స్యంబవై యబ్ధిఁ జొచ్చి సోమకుఁ ద్రుంచి-
వేధకిచ్చితి శ్రుతుల్ సాధులీల| మందరం బం
భోధి మగ్నంబు గాఁ జూచి- కూర్మమై యెత్తితి గో
పులలర| సితవరాహంబవై క్షితినుద్ధరించితి- క
నకాక్షు నాహవంబున వధించి| నరసింహ మూ
ర్తివై శరభకుఁ బొరిచితి- కనకకశిపు నల్కఁ దు
నిమివైచి| పరగ వామనతనువొంది బలిని వేఁడి|
యింద్రునకు ముజ్జగంబులనిచ్చితివు| చారువైశా
ఖపురధామ జగ్గరాయ దాసహృదయాబ్ధిసోమ
కోదండరామ॥౧౪॥

పరశురాముఁ డనంగ ధరఁ బ్రసిద్ధివహించి-
పలుమాఱు వెదకి రాజుల వధించి| భూమిఁ గశ్య
పునకుఁ బ్రేమతో నర్పించి- మునివృత్తి నుంటివి
ముదము గమర| దశరథాత్మజుఁడవై దశకంధరు
నిఁ గూల్చి- శ్రీదేవిఁ దెచ్చితి చెలువుమీర| బలుఁ

డవై దైత్యులఁ బలువురఁ బొలియించి- భూభార మడఁచితి బుధులు వొగడ॥ నసురవంచన బౌద్ధుం డవై యొనర్చి। తిరఁ గవధింతువు కల్కివై యెల్ల ఖలుల। చారువైశాఖపురధామ జగ్గరాయ। దాస హృదయాబ్ధిసోమ కోదండరామ॥౧౫॥

తల్లియుఁ దండ్రియుఁ దాతయు దైవంబు- సకల బాంధవులును సఖులు నీవె। నీ పదాబ్జంబులే నేనమ్మితిని చాల- నీకన్న మఱి దిక్కు నాకుఁ గలదె। కోరిక లెడలించి కూర్మినన్నేలవే- దుర్గుణంబులఁ బాపు దురితదూర। జగతి నిన్ బోలు రక్షకు లెందు గలుగరు- తలఁపనన్ బోలు పాతకులు లేరు॥ పతితపావన నీకన్న నితరు లెవరు। నన్ను గావ సమర్థు లనాథనాథ। చారువైశాఖపురధామ జగ్గరాయ। దాసహృదయాబ్ధిసోమ కోదండరామ॥౧౬॥

వర గాడేవంశాబ్ధి పర్వశశాంకుండు- పూత చరిత్రుండు పుణ్యరతుఁడు। ఘన యశోనిధి యునైన యొనరు జగ్గారాయ- వలనఁ జెల్లమ గర్భశుక్తిమునందుఁ। బ్రభవించి మదినేను భద్రి యంచును జను- లననన్ను నీదాసినైన నేను। కను బ్రస్తుతించితి నేచిన భంగిని- నిరతంబు ముద

మొప్ప నీవు నాదు॥ హృదయమునందు భవ
బంధ మెడలఁ జేయు। తప్పులఁ గొని కరుణించి
దాస్యమొసఁగి। చారువైశాఖపురధామ సన్నరా
య। దాసహృదయాబ్ధిసోమ కోదండరామ॥౧౭॥

ఘనకవీశ్వరులార కారుణ్యపరులార - పండి
తోత్తములార భవ్యులార। మీ కానతులు భక్తి
మీరంగఁ గావించి - విన్నపంబొనరింతు వినయ
మొప్ప। గణవర్ణనియమ ప్రకారంబు తెలియఁగ
ను - యతిప్రతియుఁ బ్రాసగతియు నెఱుఁగఁ। దు
ద్నాతుఁ బొగడఁ బాపము వాయుననుచును-
జేసితి నీకృతి చిత్తగించి॥ పరిహరించక తఁడి
యుందు నెరసులున్నఁ। జక్కఁగా దిద్దఁడీ సుప్ర
సన్నమతిని। నీరసములను పారస్యనిధులఁ జేయు।
వారెకద పెద్దలెన్న నీవసుధలోన॥౧౮॥

(సీసమాలిక) సకలాగమోద్ధాన జలచ
రేంద్రుని రక్ష - కమఠాధినాథుని కలితరక్ష। పో
త్రికులాంభోధి పూర్ణసోముని రక్ష - సింహా
ద్రిపతి నరసింహు రక్ష। వైకుంఠవాసుని వా
మనాత్ముని రక్ష - పరశురామేశుని పరమరక్ష।
రవికులతిలకుని రామచంద్రుని రక్ష - తామస
హాధుమాల ధరుని రక్ష। బుధజన సన్నుత బుద్ధదే

వుని రక్ష - కమనీయ లావణ్య కలికి రక్ష। గోపికా లోలుని గోపాలకుని రక్ష - తిరువేంగడత్తాను నగము రక్ష। శేషావతారుని శ్రీధరు సంరక్ష - తామరసాక్షు మాధవుని రక్ష। కౌస్తుభ భూషణు గరుడవాహను రక్ష - భాగవతోత్తమ భవ్య రక్ష॥ ధన్యచరితుని హరిజనార్దనుని రక్ష। సవనపరిపాలకుండు కేశవుని రక్ష। నీరజోదర వరముని నిత్య రక్ష। రాఘవుని రక్ష గొడెజగ్గరావు కెపుడు॥ ౧౯



ఈ రేడు లోకముల్ ధారాళముగనుండు - భవదాజ్ఞ లోపల భక్తవరద। జనులు భవాబ్ధిలో మునిఁగి తేలుచునుండఁ - గనికరించవు గదా కలితచరిత। కనికరించకయున్న జనుల బాధను గూర్చి - కలితోక్తులాడవు కమలనయన। కలితోక్తు లాడక కలుషాత్ములని వారిఁ - బరిహరించెదవేల పరమపురుష॥ తగవు చెప్పంగ నీకొరుల్ తగదుగాని। ప్రజలఁ బాలించకుండుట పాటిగాదు। దీనమందార నీకంటె దిక్కు గలదె। వర విశాఖ పురాధీశ హరి రమేశ॥ ౧॥

భవదాజ్ఞ లేకున్న భాసురంబుగఁ బత్రి - నై నవరించునా మధుర భావ। పరగఁ జేతనులకుఁ

పాప పుణ్యంబుల- కధికార మున్నదా యసుర
మథన। కొందఱు సౌఖ్యంబు కొందఱు దుఃఖంబు-
కొందఱు మోక్షంబు కొందఱధిక। నారకంబులఁ
జెంద నయచారివయ్యును- వీక్షింపవేటికి విమల
చరిత॥ దీనరక్షక కరుణాసదీప యనుచు। నన్ను
నింతురుని సురల్ జనులకెల్ల। హితవుగా ము
క్తి యొసఁగని హేతువేమి। వరవిశాఖ పురా
ధీశ హరిరమేశ॥ ౨॥

ఈరేడు లోకముల్ తాలుమా ఔనరింపఁ-
బుట్టింప రక్షింపఁ బొలియఁజేయ। కర్త వింతి
యొకాని గాసహాయులైయున్న- సకలభూతములకు
సముచితముగ। దుర్బుద్ధిఁ దొలగించి దోషంబు
లనణంచి- యుష్మత్పదాంభోజ యుగళమందు।
సద్భక్తి గలిగించి సంసార మెడలించి- హాయి
జ్య మొసగూపఁ జాలవా కొర॥ జీవులను మా
యాపైఁగప్పి చిక్కు వఱచి। మోక్షయత్నంబొ
నరఁచు మూర్ఖులనుచుఁ। బరిహరించిన దికేల
ది పరమపురుష। వర విశాఖ పురాధీశ హరి
రమేశ॥ 3॥

కాంతుండు లేకున్నఁ గడుపేదయైయున్నఁ-
బుత్రులు బాలతఁ బొంది యున్న। మిత్రులు లే

తుర్లై మేలిఋంగళయున్న- తిరిపెమేయూరను దొరకకున్న। దీనపోషకుఁడైన దేవరత్నామణి-కనికరంబెదఁ బూని కావకున్న। తన సహోదరులకు ధనధాన్యసంపదల్ - కరము ప్రభుత్వంబు గలిగియున్న॥ భ్రాతృగృహవాస మింతికి భవ్యమగునె। వారి కుటిల వచశ్శరవ్రజము నాటి। బాధపడు కంటె దేహంబుఁ బాయఁ బొప్పు। హీనమైయున్న బ్రదుకేల మానినులకు ॥౪॥

శాప్యకారులఁ గొల్వక భవముదొలఁగఁ। దలచి శౌరిని భజియింప ఫలముగలదె। కుమతకుసిద్ధాన్న మొల్లక కుద్రమతిని। సారవగు ధాన్యమును గోరసౌఖ్యమగునె॥౫॥



శ్రీరంగా భవదంఘ్రి నీరజములేఁ జింతింతు త్వద్దర్శనం। బెరికెన్ ఘటియింపఁ జేసెదవొ నా కా యాత్ర సిద్ధింపఁగా। సార ద్రవ్యము ప్రాపు రావు వరదా సర్వంబు నీవేసుమీ। నేరం బెంచక నన్ను జేపట్టఁ గదవే నీ చెంత రంగేశ్వరా॥౧॥

రంగారంగ యటంచు నిర్మలముగా రాజిల్లు కావేరిలో। శృంగారంబుగ గుంకి భక్తి దన

రన్ శ్రీవైష్ణవ స్త్రీలతో। రంగుల్ మీరిన భూషణా వళులతో రమ్యంబు దీపింప నుప్పొంగ ని న్ను భజింప వేడుకయెడున్ బూజింప రంగేశ్వరా॥ ౨॥

నీకారుణ్యము గోరియుందును గదా నిన్నాత్మ భావించెదన్। నీకంటెన్ మఱి దిక్కు వేఱె గలదా నెయ్యంబుతో బాంధవుల్। లోకుల్ వెంట జనంగనేగి నిను నాలోకించు భాగ్యోన్నతిన్। సాకల్యంబుగ నా కొసంగు సుయశా సర్వేశ రంగేశ్వరా॥ ౩ ॥

ధారాళంబుగ మత్ప్రహ్లాదకుని చేతన్ నిన్ను దర్శింపఁగా। సారాచారముగాఁగ నాజ్ఞ గొని నే సంతోషిత స్వాంతుఁడై। చారుల్ తందర నొంద వేగిరము రా సద్భక్తి సేవింతు నాభారంబెల్ల వహించు రంగమునకుం బంపించు రంగేశ్వరా॥ ౪॥

(మత్తకోకిల) మేలుగాఁ బ్రతిమాలఁగాఁ జలమేలరా వెత జాలురా। జాలి నొందఁగ లేదురా నిను సన్నుతింపఁగఁ జాలరా। మేలునీదయ రాదురా నను నేలరా వగఁ బాపరా। జాలమేల విశాఖపట్టణ జానకీ హృదయేశ్వరా॥ ౫॥

(మత్తకోకిల) ఎంతవేఁడిన నూరకుందువు యెప్పుడుం దయచేయవో। యంతరించుట కెంత దానను బ్రోవు నీవని నమ్మితిన్। ఇంత కంతకు లావు దప్పను నాలసంబిఁక నేలనీ। చెంత నుండెద రంగధామముఁ జేర్పవే పరమేశ్వరా॥౬॥



దేవా నే నపరాధినైతిఁ దొలుతన్ దేజంబు రాజిల్లఁగాఁ। గ్రావిణ్యంబున వైష్ణవోత్తములు తత్పాటీరమున్ బాపఁగా। నావేళన్ భవదీయ సుందరతనాకల్పంబు గాంచోంచి నీ। సేవల్ తప్పు క్షమించి నాకొసఁగవే సింహాచలాధీశ్వరా॥౧॥

వీసంబైన వివేకమున్ సుగుణమున్ విజ్ఞానమాచారమున్। వాసిన్ బుణ్యము నేనెఱుంగను మనోవాక్కాయకర్మంబులన్। దాసిన్ నన్నుఁ దరింపఁ జేయుటకునై దాక్షిణ్యభావంబుతో। శ్రీపారంబగు భక్తి యుక్తు లిడవే సింహాచలాధీశ్వరా॥౨॥

సామీ భాగవతాపచారములు నే సర్వంబు గావించితిన్। సామాన్యంబులు గాని పాతకములన్ సంతోషమై చేసితిన్। నా మోసం

బున కెద్దిమేర వినతిన్ నా భారముఁ బూని నా|
సేమం బించుక చింత సేయవె దయన్ సింహా
చలాధీశ్వరా॥ ౩॥

నీ సామర్థ్య మెఱుంగఁ జాలరు సురల్ నీ
తేజ గర్భానలున్| నాశీలంబును విన్నవించితిఁ
గదా నాథుఁ వశంబౌనె నా| యాశా పాశ
ముఁ బాపి మన్ననములో నశ్రాంతమున్ నిల్ప
వే| శ్రీశా త్వత్పదపంకజాత యుగమున్ సిం
హాచలాధీశ్వరా॥౪॥

దైవాధీనము లోకము| శ్రీవరు నాజ్ఞకును ద
ప్ప శివునకు వశమా| యేవిధిని గల్గు మోక్షము
భావజగురుఁ డిచ్చకున్నఁ బ్రాజ్ఞుల కైనన్ ॥ ౫ ॥

మునివరులకు లేవకపద| వనజంబులయం
దు భక్తి వదినో సంగతి చే|తనులకుఁ గలిగించిన
వా| రెంకము విసుదలచలేరె యంబుజనాభా|



## శ్రీరాములు-

## శ్రీరఘునాయకశతకము-

## SRI RAGHUNAYAKA SATAKAMU.



శ్రీ కరుణాకరా చరణసేవక లాలన భక్త
పాదరా। లోకమనోహరా విబుధలోకవరా గు
రురాజశేఖరా। భీకరసంసృతిద్రుమ విభేదనశా
త లసత్కుఠారధా।రా కలుష ప్రవర్గభిదు
రా యతినాయక దీనపోషకా॥౧॥

శ్రీ రమణీకళత్ర సరసీరుహనేత్ర జగత్ప
విత్ర స। త్సారసబృంద మిత్ర సురసన్నుతిపా
త్ర నరేంద్రపుత్ర శృం। గార సమగ్రగాత్ర జ
న కగ్నవిదారణ కృచ్చరిత్ర శ్రీ। నారదమాని గీ
తచరణా రఘునాయక దీనపోషకా॥౨॥

వరకరుణానిధీ విమలవాదవిధీ గుణరత్నవా
రిధీ। నరరథసారథీ విహగనాథరథీ విహితార్య
సన్నిధీ। పరికలితేషుధీ విపులభవ్య సుధీ గతవై
భవావధీ। స్థిరముగసన్నుతించెదను శ్రీరఘునా
యక దీనపోషకా॥౩॥

సకలగుణాభిరామ మునిసన్నుతనామ సు
రారిభీమ పావకసఖనందన ప్రమదవారిధిసో
మ ధరాలలామ ఘోరకుమతదైత్యకంచయ
విరామ పరాక్రమ కీర్తిధామ రామకమల
ధామరామ పరమా రఘునాయక దీనపోషకా॥

కలుషసరిత్తరీ దనుజకంజకరీ శ్రితలోకహృ
ద్గరీ। యలఘుదయాఝరీ హృతబలాంచదరీ వి
పులోక్తిమాధురీ। సలలితచాతురీ కలితసచ్ఛ
రీ పరతత్త్వవైఖరీ। ఖలగజకేసరీ గుహాసఖా ర
ఘునాయక దీనపోషకా॥౫॥

ఆగమసార చక్రధర యాదవవంశవరా ప
రాత్పరా। భాగవతాదరా వినత పాపహరా
జగదేకసుందరా। సాగరమందిరా సుగుణసా
గర సేవకవజ్రపంజరా। రాగమదాంధశిక్ష
ణపరా రఘునాయక దీనపోషకా॥౬॥

సేవకరక్షకా విమత సింధుమదక్షయకారి
సాయకా। భూవరనాయకా దురితభూరుహ
పావక వట్పదాలకా। భావజరూపకా దివిజపా
లక యాశ్రితమోక్షదాయకా। కావవె నన్ను
గోపకసఖా రఘునాయక దీనపోషకా॥౭॥

కదనకఠోర కామరిపుకార్ముకఖండన స

త్యభాషణా। సదమలవాసవాది సుర సన్నుత
ఖండన దైత్యభీషణా। మదగజ సింహయాన
మణిమండన సింధుశయాన భక్త దై। న్యదళన
దక్షిణా వరగుణా రఘునాయక దీనపోషకా॥

మాధవరూప భావభవమానిత పఙ్క్తిరథే
శసంభవా। భూధవ కేశవా కుమతిభూధరవా
సవ శాంతభావనీ। శ్రీధవ వాసుదేవ ఖలరా
క్షసశాతన దేవ దేవ దే। వా ధరరాజధైర్య వి
భవా రఘునాయక దీనపోషకా॥౯॥

పావన గతలాప పరపక్ష నివారక చాప
గోపికా। భావహారానులాప ఘనపంకజ బాంధ
వ వంశదీపదే। వా వన సుప్రతాప పశితాశన
భీకరరూప సింధుతా। పావహ కోప నిర్భర
కృపా రఘునాయక దీనపోషకా॥౧౦॥

నిరతము త్వత్పదాబ్జములు నెమ్మదిఁ బూను
పరాశరాత్మజున్। సురుచిర లీలఁ గొల్చెదను
సొంపమరన్ నినుఁ బ్రస్తుతింపఁగా। సరస కవి
త్వ వైఖరిని జక్కఁగ నా కొనఁ గూడఁ జేయు
మో। తరణి కులేశ భక్త వరదా రఘునాయక
దీనపోషకా॥౧౧॥

శ్రీవనితాశిరోమణికి సేవ యొనర్చినమునర

రించెదన్। భావమునందు సత్కవులఁ బాయ
కనిల్పి భజింతు నాకుత్వ। త్పావన నామముల్
బలుకు భాగ్యము సంగి యనుగ్రహింపు నా। నా
విధభక్తపాపహరణా రఘునాయకదీనపోషకా॥
ఏపగు చంపకోత్పలము లింపుగ నూఱొన
గూర్చి వానిచే। నీపద నీరజాతముల నిండినవే
డుకఁ బూజఁ జేసెదన్, బాగుగఁ దావకీన కృ
ప భాసిల నంతయుఁ జిత్తగించు మ। న్నా పరప
క్షధైర్యహరణా రఘునాయక దీన పోషకా॥౧౩
రాకశశాంక చంద్రికల రాజితహారమరాళ
మల్లికా। స్తోకపటీరహీరముల దోషము నెంచు
సుకీర్తినొప్పరా। మా కమలాక్ష కైకొనుము
మానుగ నాదుకవిత్వ మాలికన్। నాకపురాధినా
థ శరణా రఘునాయక దీనపోషకా॥౧౪॥
నీరజగర్భుఁడున్ హరుఁడు నిర్జర లోకగు
రుండు శేషుఁడున్। బారము ముట్టఁగాను నిను
భాసుర లీల నుతింప నేర్తురే। ధారణి లోపల
న్మనుల దారుణకర్మను వాకు శక్యమే। నారద గీ
యమానచరణా రఘు నాయక దీనపోషకా॥౧౫
ఆర్యయ మదీయ వాక్య నిచయంబులు తప్పు
లు గల్గి యుండినన్। వెరవుగ నీదు నామము ప

వితతి తావానికొఁగంగదే ధరన్। పరగఁగ మేఁటి
చో నినుము బంగరుచాయ వహించ కుంతునే।
నరసఖ దైత్యదర్ప హరణా రఘునాయక దీన
పోషకా॥౧౬॥

దురిత పయోధిలో మునిఁగి దుర్బలుడై కడ
గానలేనిఁకన్। బరువడఁ దావకీన పదపంకజపో
తమునందు నిల్పినీ। వరఁదుగఁ గణా ధారకుఁడ
వై మది మోదము మీరఁ జేర్పవా। పరమ ప
దాఖ్యపారమును గృపన్ రఘునాయక దీనపోషకా॥

అరికి భయంకరుండవును నల్లభ వాదులకుం
బ్రభుండవున్। సిరికి మనోహరుండవును సేవక
కోటుల కిష్టుదుండవున్। కవికభిరక్షకుండవును గా
న పరేశుఁడ వీవె యంచునే। దిరముగఁ జాటె
దన్ గుణనిధీ రఘునాయక దీన పోషకా॥౧౮॥

పేదకుఁ బెన్నిధానమును భిక్షుకకింపగు నో
గిరంబును గా। పాదుగ నబ్బజేయు క్రియ గంప
రణాగ్నిఁ దపింపుచున్నవా। కాదర మొప్పఁ దా
వక కథామృత మానఁగ నిచ్చి తెంతయున్। నీద
య నేగణింపఁగలనే రఘునాయక దీనపోషకా॥

గిరిధరుఁ డంబుజోదరుఁడు కేశవుఁ డాహరి
విశ్వరూపుఁ డా। నరహరి రామచంద్రుఁ డల

నందసుకుందు హేమాంగవాహుడు ౘా। సిరిపతి నా
కు దైవమని చెచ్చెర నే నిను బ్రస్తుతించెదన్। న
ర వర పారిజాత హరణా రఘునాయక దీనపో
షకా ౨౦॥

ఓ కమలా మనోరమణ యో దనుజాంతక
యో మహారథా। యో కలిదోషవిధ్వంసన యో శ
రణాగత లోక రక్షకా। యో కరుణానిధీ వరద
యో పరమాత్మ మహాత్మ కావవే। యో కుజనప్ర
ణాశ హరి యో రఘునాయక దీనపోషకా॥ ౨౧

సుకృతనకల్మినన్ విడిచి సుస్థిరతన్ సురద్రా
పుమాడ్కి పెం। పాదప జనుల్ నినుం గొలువ
నొల్లక యన్యులఁ గొల్తురకటా। మదిని వరం
బు నేనెఱుఁగ మాధవ నాకభయంబొసంగవే।
సదయుఁడవై సముజ్జ్వలయశా రఘునాయకదీ
నపోషకా॥ ౨౨ ॥

దయ గలవాఁడవంచు మును దానవ రాజకు
మారకున్ గరిన్ రయమునఁ గాచి తంచు బుధ
రంజన శీలుఁడ వంచు నాశ్రిత। ప్రియుఁడ వటం
చు నీశరణు ప్రేమనుబొందితి భక్తవత్సలా। న
యమునఁ గారవించు కృప నన్ రఘునాయకదీ
నపోషకా॥ ౨౩ ॥

బంధుల నెల్లఁగన్గొని కృపాపరుఁడై నరుఁడుం
డ వానికిన్। బొందఁగ విశ్వరూపమును ముం
దుగ గీతలు చెప్పి చూపి యుం। పొందఁగఁ దద్భ్ర
మంబుడుపు నోడను మామక మానసంబులోఁ।
జెందిన భ్రాంతిఁబాపు వెస శ్రీరఘునాయక దీన
పోషకా॥ ౭౮॥

అక్కట పెక్కు జన్మములయం౯ డతిబాధలు
పొందిపొంది నే। నెక్కడఁబ్రాపు చాలకను హీ
నత నొంది యుపాయ మెంచుచున్। గ్రక్కున
త్వత్పదాబ్జములు గంటి కృతార్థత నొంది
తి ననున్। మక్కువఁ జేసి యేలికొనుమా ర
ఘునాయక దీనపోషకా॥ ౭౯॥

పొల్లగు సంస్కృతిన్ బడలి పోవ సమర్థులు
గారటంచు నే। చిల్లరవారిరోసి వెసఁజేరితి నీ
శరణంబు గాఁగ నా। యుల్లమునందు నిల్పి కరు
ణోజ్జ్వల నన్ దయమీఱ నేలుమీ। తల్లివితండ్రివి
వె వరదా రఘునాయక దీనపోషకా॥ ౮౦॥

చక్కగ నిన్నెగొల్వవలె సౌఖ్యము నిచ్చిన
నీవె యీవలెఁ। మక్కువనీవె సేయవలె మా
నమిచ్చిననీవే యీవలెన్। చిక్కిన నీకె చిక్కు
వలె సేమమునిచ్చిన నీవెయీవలెన్। చిక్కులు

నేయునేల హరి శ్రీరఘునాయక దీనపోషకా॥

రాముఁడు రాముఁడంచు మది రంజిలఁగా భవదీయ నామమున్। ప్రేమము మీరఁ బల్కనను పెంపుగ మోక్షము నొందునే గదా। పామరవృత్తిఁ బాసి భువిఁ బంధముఁ ద్రెంచను వ్రాయు మట్టినినామము నాకు నాల్క సుగుణా రఘునాయక దీనపోషకా॥౨౮॥

రామచితంబణాంకు మదిరంజిలఁ బల్కనసూయటన్నచో। సాధుగ మోక్షమబ్బునని సమ్మనులం డ్రిది నిక్కమౌఁ గదా। నీదయ నాదు భాగ్య మిఁక నే జపియింతు త్వదీయ నామమున్। మోదము మీరఁగా సతతమున్ రఘు నాయక దీనపోషకా॥౨౯॥

ఘోర భవాబ్ధినావ నరకోటుల సద్గతి త్రోవ ముస్తరా। పారని తాంత సాంద్ర తరపాపవనంబులఁ గాల్పఁ గీలి దుర్వార దురంత మోహ తిమిర ప్రకరంబు నణంప హేళి। నీ తారకనామమెన్న వరదా రఘునాయక దీనపోషకా॥౩౦॥

కాలభట ప్రకంపనము గర్వితవైరివినాశదానమున్। లాలిత వాగ్విభూషణము రాజిత ముక్తి ఫలప్రదంబు నీ। ధ్యానలిత మోహమున్ గలి

త మోదమునై తగు నీదు నామమున్। జాల భ
జంతు నిర్మలయశా రఘునాయక దీనపోషకా॥
ఉమకును నందివాహనున కున్నతమంత్రి మ
హాల్యమున్ గజేంద్రమునకు రక్షకంబునగు తా
వకనామము చాల సంతసంబమరంగ నాదు జి
హ్వా నిడి ప్రత్యహంబున్ వచియింపఁ జేసి దు।
ర్భరమ మెడలింపవే గిరిధరా రఘునాయక దీ
నపోషకా॥౩౨॥
పావన రామ నామకమును భక్తిఁ బఠించిన
వారి పాదముల్। భావనులోఁ దలంతు నటఁబా
రకుఁడంచుఁ గృతాంతుఁ డెంతయున్। సేవక
కోటికిన్ దెలియఁజెప్పు నటందురు పెద్ద లెన్న
నే। దైవముసాటి నీకు వరదా రఘునాయక దీ
నపోషకా॥౩౩॥
అంతమునందు భానుసుతుఁ డంపిన దూతలు
ఘోర రూపులై। చెంతను జేరు కాలమునఁ జిం
తయు రోగము హెచ్చఁగాన నా।కంతటనీదుసం
స్మరణ మబ్బునో యబ్బదో యిప్పుడే నినున్
సంతతమున్ నుతింతు సుయశా రఘునాయక
దీన పోషకా॥౩౪॥
చెరుకు రసంబు తేనెయును జెన్నగు చక్కె

రహానకంబునన్। నిరతము గ్రావఁగ్రోల హార
నీరజగర్భ నుతా రమేశ నీ। చెరవుగ నీదు నా
మసుధ వేమరు నానెద వాంఛదీర సు। స్థిర మతి
నాకొసంగు హరి శ్రీరఘునాయక దీనపోషకా॥

క్రోలెద నీకథామధువు గ్రోలెద నీపదపద్మ
తోయముల్। గ్రోలెద నీదు నామసుధ కోరిక
వాచవి దీరునట్టుగాఁ। గ్రోలెద భవ్య భాగవత
కోమల వాక్కుసుమంబు తేనె రా। మాలలి
తాబ్జనేత్ర పరమా రఘునాయక దీనపోషకా॥

పరమపదేశ నిన్ను మదిఁ బాయక యుండి
న వారి కల్మషం। బరయఁగ మందరాద్రి పొడ
వైన రయంబునఁ బోదె ధూళియై। సరసతము
క్తికాంత తన చాదు కరాబ్జమునన్ గ్రహించదే।
నరహరి వారలన్ శుభగుణా రఘునాయక దీ
నపోషకా॥౩౭॥

తరణికులేశ నామనవి తాలిమిమీఱఁగ నా
లకించి నన్నరసి వినాశసంభవ జరామయ భీ
తి విహీనమైన త్వచ్చరణ సరోజ యుగ్మ మణి
సౌధముఁ జేర్చవె దీనమానవో। తరుణ పవిత్రకు
శాత్త్రబిరుదా రఘునాయక దీనపోషకా॥౩౮॥

కంపదలన్ ధరాతనయ గర్వ భయ క్షయ

మున్ సమీరజుం। డింపుగ మోహవారణము నె
ప్పుడు లక్ష్మణుఁ డార్తినాశమున్। బెంపుగ నీ
దు నామమును బ్రీతిని మోక్షము నీవు గూర్చితే।
రక్షింపుదు రయ్య భక్తులను శ్రీరఘునాయక దీ
నపోషకా॥ ౩౮॥

పోషణ సేయఁ దల్లివి ప్రభూత హితంబుల
సంఘటించి నీ। ర్దోషతఁ గూర్పఁ దండ్రి వతిదు
స్తర విస్తృత మోహరోగమున్। శేషము లేక
యంత నిరసింపఁగ వెజ్జవు గాచి యేలఁగా। శే
షివి నీవు దాసులకు శ్రీరఘునాయక దీనపోషకా॥

ఆజి భయంకరుండు వినతాదరుఁ డార్తని
వారకుండు వి। భ్రాజితసద్యశుండు నగు రామ
నరేంద్రుని సాటి దైవతం। బీజగమందు లేఁడను
చు నింపుగ బాహువులెత్తి పలికెడన్। రాజి
త భక్తిచే సిరివరా రఘునాయక దీనపోషకా॥

ఉదధములోఁ బ్రపంచమిది యున్నత లీలను
లోకజాలమున్। సదమల రీతిఁ బోషణము స
ల్పెదు నెప్పుడు నీదు పుత్రినన్। మదిఁ గనఁ బ్రే
మ మీఱ బహుమానన పురస్సరదృష్టిఁ జూచితే।
హృదయముఁ జేర్చుకొమ్ము సుయశా రఘునాయక
దీనపోషకా॥ ౪౦॥

మునిజన మానసాబ్జముల మోదము మీఱ వసించు భృంగమా। యనయము గోసలేంద్రసుతయా రసి పెంచిన రాజకీరమా। ఘనరుచిమీఱ నా నయనకైరవముల్ వికసింప నీముఖం। బను నమృతాంశుఁ జూపవె దయన్ రఘునాయక దీనపోషకా॥౭౩॥

సేవకులైనవారలను సేమము మీఱఁగ నేలినాఁడవు। నే విధినైనఁ బ్రోతువని యెంతయు నమ్మితి నయ్య నీవు నా। భావమునన్ వసించి భవబాధ నణంపక యుంటినాయనా। నావఁగఁ బాపు వేగఁ గరుణన్ రఘునాయక దీనపోషకా॥

పాపముఁ బాపుమంటి నిఁక బాముఁలఁ బెట్టకుమంటి దాపునుం। బ్రాపున నీవెయంటి నను పాలనఁ జేయవె యంటి నాకుని। క్షేపము నీవెయంటి కడుసేమముగాఁ గృపఁ జూడుమంటి నం। తాపము మాన్పుమంటి వరదా రఘునాయక దీనపోషకా॥౭౫॥

మన్నన నేలుమంటి నినుమాని మఱెవ్వరిఁ గొల్వ నంటి నా। యన్నవు నీవెయంటి నుకురంటఁగ హస్తము లెత్తి నీకు నే। సన్నుతిఁ జేతునంటి సురసన్నుత నీసరిదైవ మెక్కడన్। ది

న్నఁగ లేఁడటంటి సుమతీ రఘునాయక దీనపోషకా॥౪౬॥

రసనకు నీదు నామసుధ రమ్యముగాఁగ నొసంగుమంటి నా। వీనులు వేడలించి త్వత్కథలు వినుల నింపు గనింపుమంటి నా। కోసరుల వీడఁజేసి మది కోరికె లెల్లను బాపుమంటి తా। మసమతీమాన్పుమంటి పరమా రఘునాయక దీనపోషకా॥౪౭॥

చిక్కితి నంటి నింక నను జిక్కులఁ బెట్టకుమంటి నీకు నేఁ। దక్కితి నంటి త్వచ్చరణదాస్యము నా కొనఁగూర్పుమంటి నే। మ్రొక్కితి నంటి నన్ను మది మోదము మీఱఁగ నేలుమంటి నిన్। దిక్కని నమ్మియుంటి వరధీ రఘునాయక దీనపోషకా॥౪౮॥

నిరతము నెట్టి వారలను నింద యొనర్చుచునుండు వాఁడె యే। తరి భయ మొందదెట్టిదురితంబులకున్ మన మేమి సేతు దు। స్తరము కృతాంతుదండనము తప్పదు మందటిమాగ్గ మెట్టిదో। సిరివర నీవె నాకు గతి శ్రీరఘునాయక దీనపోషకా॥౪౯॥

పాతకదూర త్వత్కథలు పల్కవినన్ మది భక్తి లేనుగా। నీతికిఁ బాసి దుష్కథలు నిచ్చలు

ష్టుణ రాక్షసాంతకా। పరమపదేశ భక్త భవ
పాశవినాశ మురారి కేశవా। స్థిరమతి నాకొ
సంగు హరి శ్రీరఘునాయక దీనపోషకా ॥౫౪

నాకమునైనఁ గోర నొకనాఁడును త్వత్పద భ
క్తిఁ గోరెదన్। నీ కరుణాసుధారసము నించినఁ
జాలు నొకింత నాపయిన్। భీకర కాలదూతలను
బంధములంతు నణంతు మృత్యువున్। నాకిఁకనీ
వెదిక్కు సుభగా రఘునాయక దీనపోషకా ॥

కోరికెఁ గోరఁ జేసి యతి ఘోర భవాగ్ని
గూర్చనేలనా। భారము నీదె దేవ నను భక్తుల
సన్నిధిఁ జేర్పరాదె సం। సారము చాలు నొకట
నిను సన్నుతి సేయఁగ బుద్ధినీఁగదే। సారసపత్ర
నేత్ర సుయశా రఘునాయక దీనపోషకా ॥౫౬॥

నీ పదధూళిచే శిలను నిర్మలయోషను జేసి
నావు ము। న్నాపద వాయ ద్రౌపదికి నక్షయ
వస్త్రము లిచ్చినావు నా। కోపిక లేదు తాపము
లనొందఁగఁ దప్పులు సైఁచి కావవే। తాపసవం
దితా సురనుతా రఘునాయక దీనపోషకా ॥౫౭

శ్యామలకోమలాంగ సురసన్నుత పాదస
రోజ పూర్ణ[illegible]మా। సోముని బోలు నీ మొగము
సొంపుఁ గనుంగవ దృష్టి మీరఁగాఁ జేరి మదలి

ర్ప నాకెప్పుడు పెంపుగఁ గన్గొను భాగ్య మబ్బు
నో। కామసమానరూప యనఘా రఘునాయక
దీనపోషకా॥౫౮॥

భాసురలీల ముజ్జగము పాలన సేసినఁ దృప్తి
పుట్టదా। యాసము నొందిదీ కూర్చు ధన మొంద
క రూకయుఁ గూడరాదటం। చాసలబాసి తావ
క పదాంబుజ దాస్య మొసఁగ్వఁ జేరితిన్। దా
సికి నీవె దిక్కె వరదా రఘునాయక దీనపోషకా॥

ఎన్నఁడు నిన్ను నేమఱవ నెన్నఁడు నాకిత
రేచ్ఛలేమ ఓ। కన్నమ తెన్వ రింక ననుఁ గావ
సమర్థులు నీవెగాక నీ। కన్నులఁజూచు నన్నెల
మిఁ గాలుని బాధఁ బడంగఁజాల నా। పన్నశర
ణ్య నిర్భరకృపా రఘునాయక దీనపోషకా॥

నీకథఁ బల్కు పల్కులును నీకుపచారము సే
యు పాణులున్। నీ కడఁ బాయకుండు మది
నిన్నె కనుంగొనుచుండు దృష్టియున్। నీ కమనీ
య చర్యవిన విచ్చులుఁ గోరెడు కర్ణ యుగ్మ
మున్। నాకొనఁగూర్పవయ్య కరుణన్ రఘు
నాయక దీనపోషకా॥౬౧॥

నంమని కాంతయందుఁ గరినాథునియందు
నహల్యయందున:। క్రిందనునందు దైత్యకులరా

జ తనూభవునంపు ద్రౌపదీ। సుందరీయందుం గ్లు కృపసొంపుగ నిందుకమైన నాయెడన్। జెందంగం జేయు వేమిటికి శ్రీరఘునాయక దీనపోషకా॥

మన్ననచేసి యేలుకొనుమా యనుమానము మాని యీక్రియం। గన్నడ నేను నేలకలకాలము నే శ్రీమం జెందుచుండంగా। వెన్నుండు సౌఖ్యమిచ్చె దిక నెన్నండు నన్ను ననుగ్రహించె దో। యన్న మహానుభావ సదయా రఘునాయక దీనపోషకా॥ ౭౩॥

నేరుపుమీఱ నాహితము నెమ్మది నారసి నిన్ను వేడంగా। నేరను నీవె యిమ్మెఱింగి నీమదికంతయు గోచరంబెకా। కారుణికాత్మ తత్తరుణ గల్గిన జాలునటంచు నిన్ననేం। జేరితి నేమిచేసెదవొ శ్రీరఘునాయక దీనపోషకా॥ ౭౪॥

నికరము విన్నవించెదను నీరజలోచన భక్తపాలవా। యకట ఆతనె ధనంబడుగ నన్యులం జేరను మోక్షమిమ్మనన్। జకటగం ద్వత్పదాబ్జములు సన్నుతి చేసెద దాస్యమిచ్చినన్। జిక్కులం బెట్టకేలు మిక శ్రీరఘునాయక దీనపోషకా॥

పాపముం బుణ్యమున్ భువన పావన నాదు ధనంబు సర్వముం। శ్రీపతి నీకు నర్పణము చే

సెద నన్ గృపఁజూడు సంసృతిన్। దాపము
నొందఁ లేను వెసఁ దావకదాస్యము నిమ్ము। ప్రా
పుమ। దాపును నాకు నీవె వరదా రఘునాయ
క దీనపోషకా॥౬౬॥

పలుమఱు రామ రామ హరి పన్నగశాయి
యటంచుఁ బిల్వఁగాఁ। బలుకవు రావదేమిటికిఁ
బాపమతిన్ దయఁ జేవొ కోపమో। కలియుగవే
ళరాఁదగదొ కల్మషవారిధి మున్గియున్ననేఁ। జ
లమున కెంతదాన సుయశా రఘునాయక దీ
నపోషకా॥౬౭॥

దాసిని గానె నీకు మునుదాసుల నెంచఁజెఁ
బ్రోచినావు నేఁ జేసిన నేరమేమి నినుజేరఁగరా
విడనీకు నాయహా। గాసికి నోర్వ లేను మఱిఁగ
ల్గదె ప్రీతి యొకింతమైన నా। యాసముఁ బాపి
యేలు సదయా రఘునాయక దీనపోషకా॥౬౮॥

పలుకులు తేనె లుట్టిపడఁ బల్కుచు నేఁటెఁ
గ్రూరచిత్తనై। మెఱఁగుచు సూనృతం బనెడు మే
రకుఁదప్పి భవాంబురాశిలోఁ। బలుమఱు మున్గి
తేలు నను బాయక తావక పాదపద్మమన్। గల
మున దాఁటజేయు మనఘా రఘునాయక దీన
పోషకా॥౬౯॥

చక్కని సామివంచుఁ గడు సమ్మతి దాసులఁ
గాంతువంచునా। యక్కఱఁ దీర్తువంచు నిఁక న
న్యుల వేఁడఁగ లేనటంచు నన్। సక్కము బా
యనంచు మది నిన్నెడఁ బాయఁగఁ జాలనంచు
నిన్। మక్కువఁ జేరినాను పరమా రఘునాయక
దీన పోషకా॥ ౭౦॥

కలిత సరోజసూన వర కాముక కేతన శం
ఖచక్రలాం। గలముఖ రేఖలన్ విమల కాంతులఁ
బొల్చు భవత్పదాంబుజం। బెలమిని నయ్యహ
ల్య నెనయించి కృతార్థను జేసి తట్లనన్। జెలఁ
గి యనుగ్రహింపు దయ శ్రీరఘునాయక దీన
పోషకా। ౭౧॥

ఆన్నకు బుద్ధిఁ జెప్పి సుఖ మారడిఁ బో నవ
మాన మొంది యా। పన్న శరణ్యు యేలుమని భ
క్తి నినున్ వెసఁ జేరి మ్రొక్కినన్। విన్నప మాల
కించి కడు వింతగ లంకకు రాజుఁ జేయవే। పన్న
గ నవ్విభీషణుఁ గృపన్ రఘునాయక దీన పో
షకా॥ ౭౨॥

మకరము నగ్గజేంద్రుఁడును మానుగ ఘోర
రణం బొనర్చుచోఁ। దిక్రమకఁ బొంది నాగ మ
తిదీనత నిన్ను భజించె నంతలోఁ। బ్రకటజవంబు

నచ్చటచి భాసుర చక్రము చేత నక్రమున్। వికల ము గావడిన్ దునుమవే రఘునాయక దీనపోషకా॥

మిక్కిలి లేమిఁ జిక్కి కలిమిన్ నిను వేడఁ గుచేలుఁ డర్మిలిన్। చక్కఁగ నేగుదేరఁ గని సన్మతిఁ బూజ యొనర్చి ముల్లియం। దక్కఁగ నిల్వ తత్పృథుక తండులముల్ భుజియించి జన్నగ। ట్టిక్కటఁ దీర్చినావు గదయా రఘునాయక దీనపోషకా॥ ౭౪॥

కర్ణములన్ భవత్కథలు గ్రమ్మక యుండఁగ మ్రోయఘంటలన్। పూర్ణముగా ధరించిన యపుణ్యుని సద్గతిఁ జేర్చినావు నిన్। వర్ణనసేయువారలకు వంచన యించుక యేనిఁ గల్గునే। యర్ణవశాయి భక్తసదయా రఘునాయక దీనపోషకా॥ ౭౫॥

పాయని మోహభారమునఁ బామరుఁడైన యజామిళుండు దా। గాయము వాయు కాలమున గట్టిగఁ బ్రాణభయంబు నొందినా। రాయణ యంచుఁ బుత్రిననురాగమునన్ బిలువంగ ముక్తికిన్। దాయిగఁ జేసినావు వరదా రఘునాయక దీనపోషకా॥ ౭౬॥

చిరమృత పుత్రకున్ గురుఁడు చెచ్చెరఁ దె

ష్మని పల్కఁ సంతటన్। సురుచిరలీల వారినిధిఁ
జొచ్చి తదర్భకుఁడందు లేమిఁ జొ। ప్పరయుచు
నాకృతాంతు నిలయంబునకున్ వడి నేగి బాలు
సు। స్థిరమతిఁదెచ్చియిచ్చితివి శ్రీరఘునాయక దీ
నపోషకా॥ ౭౭॥

వాసిగ నంబరీష నరపాలునిఁ గూల్చ్వమటం
చు నీప్సృఁడు। ర్వాసుఁడుకృత్తిఁ బంప ననివా
రితమైనగు చక్రరాజమున్। భాసురలీల దాని న
డఁపన్ రయ మొప్పఁగఁ బంచి కత్కృపన్। దా
సునిఁ బ్రోచినావు వరదా రఘు నాయక దీన
పోషకా॥ ౭౮॥

సుధగొని దైత్యదానవులు పొత్కుచు నేగిరి
మాకు దిక్కెవ్వ। త్పదము లెయంచు దేవతలు
ప్రస్తుతి సేయ దయా పయోధివై। సుదమున
లోకముల్ బొదల మోహినివైతి మహాద్భుతం
బుగా। సదమలభక్తపాల సుయశా రఘు నా
యక దీనపోషకా॥ ౭౯॥

మోహినివైన నిన్నుఁగని మోహముమీఱ సు
ధా ఘటంబు మా। కో హరిణాక్షి పంచి యిడు
మొప్పఁగనంచును దైత్యులీయఁగా। స్నేహము
మీఱ వేల్పులకుఁ బెచ్చెరఁ ద్రావఁగ నిచ్చి యం

తలో| శ్రీహరిమూర్తిఁ గైకొనవె శ్రీరఘు నా
యక దీనపోషకా||౮౦||

భూసతి చేరి వేఁడ యదు భూపకులంబునఁ
గృష్ణ మూర్తివై| భాసురలీలఁ బుట్టి యతి పాపప
రాత్ముని కంసదానవున్| వాసి యొసంగఁ ద్రుంచి
సురవైరుల నెల్లను బట్టి చంపవే| వాసవవర్ణనీ
య విభవా రఘునాయక దీనపోషకా||౮౧||

భీకర మీనరూపమునఁ బెంపమరన్ జలరా
శి సోమకున్| దీకొని పోరి త్రుంచి యతి ధీరతఁ
బ్రామనుకుల్ గ్రహించి యా| నాక సదుల్ ను
తింప నిజ నందనుఁ డైన విరించికీయవే| శ్రీకమ
నీయ మూర్తిహరి శ్రీరఘునాయక దీనపోషకా||

సురలును దానవుల్ గలసి సొంపుగ వారిధి
మందరాద్రిచేఁ| దరువుగ మూడులోకములు దై
న్యము నొందఁగఁ గొండ క్రుంగినన్| వెరవుగ
కూర్మమై గిరిని వింతగ మీఁదికి నెత్తి వేల్పులన్|
హరిమాయఁ బ్రోచినావు సదయా రఘు నా
యక దీనపోషకా||౮౩||

నేరము మీఱమున్ గనక నేతుఁడు భూమి
హరించి నీరధిన్| జేరి వసింపఁ గాఁ గినిసి చె
న్నలరార వరాహ రూపమై| ధీరత దానిఁ గూల్చి

ధరదీనతఁ బాయఁగఁ జేయవే దయన్। కారు
ణికాత్మ ఫల్గునసఖా రఘునాయక దీనపోషకా॥

కరము హిరణ్యదానవుఁ డఖండ భవత్పద
పద్మదాస్యత। త్వరు నపరాధశూన్యు సుతు బా
ధనొనర్ప నృసింహమూర్తివై। బరువడి వానిఁ
ద్రుంచి పరిపాలనసేయవె యాత్మభక్తుని। స్థి
ర మతి నప్రమేయ హరి శ్రీరఘునాయక దీన
పోషకా॥౬౫॥

వామను మేనుఁదాల్చి కడు వంచన మూఁడ
డుగుల్ మహాబలిన్। భూమిని వేఁడి పుచ్చుకొ
ని పొల్పుగ నున్న మిన్నుముట్టి సు। త్రామున
కిచ్చి దాతను దిరంబుగ భోగుల పోలిల నిల్పవే।
క్షేమము వెల్లిలొండ హరి శ్రీరఘునాయక దీన
పోషకా॥౬౬॥

పరశువుచే నశేష నరపాలకులన్ భృగురా
మమూర్తివై। యరుదుగఁ ద్రుంచి కశ్యపునకెల్ల
న గద్వర ధారవోసి యా। స్థిరవసియించనం
చును ప్రతిజ్ఞ యొనర్చి ధరా నివాసమే। తరిని
దొలంగినావు వరదా రఘునాయక దీనపోషకా॥

దశరథ రామరూపమున ధారుణిపై జనియిం
చి సత్యవా। గ్వశుఁడగు తండ్రి యాజ్ఞవనవాటి

కంజోద్భవ ధూవిరోగదు। ర్దశను గృశించి రా
వణుని రాక్షసులఁ గమయించి జానకి। శశిము
ఖిఁ దెచ్చినావు సుయశా రఘునాయక దీనపో
షకా॥౮౮॥

అసదృశ యాదవాన్వయమునందు లసద్బల
రామ మూర్తివై। పసులను గోపబాలకులఁ బాలన
సేయుచు రాజవేషులై। వసుధఁ జరించు దానవు
లఁ బల్వురవేమరు సంహరించి సం। తసమునఁ
జెందినావు వరదా రఘునాయక దీనపోషకా॥

సుమహిత బుద్ధరూపమున శుద్ధతరంబయి
మించు స్వవ్రిసా। దమఖిలలోక భోగ్యముగఁ ద
ప్పకచేసి జనాళి కన్నుదా। న మహిమఁ దెల్పుచుం
గరుణ నమ్రిజనాళిని బోరితఁ బూరుషో। త్తమ
భువినుండవే సురనుతా రఘునాయక దీనపోషకా॥

కలియుగవేళ మానవులు గర్వితులై కులసం
కరంబుగా। మలినతనొందె భూసురుల మాన్యు
లదీనుల బాధపర్చఁగా। నలఘునిశాతశస్త్రిమున
నా ఖలకోటుల నెల్లఁ గల్కివై। దల్లితులఁ జేతు
వీవె వరదా రఘునాయక దీనపోషకా॥౯౧॥

సలలిత మీన కూర్మతను సంయుత కోల నృ
సింహ ఖిగ్రిభా। జ్వల వర వామనాంగ ధర

భార్గవ రామ నరేంద్ర రామ శ్రీ। హలధర రా
మ నామ వినతాదర బౌద్ధ సురారిభీమ శ్రీ। కలి
కి రమాభిరామ యనఘా రఘునాయకదీనపోషకా

తల్లియుఁ దండ్రియున్ గురుఁడు దైవము బం
ధులు నీవె యంచు నా। యుల్లమునందు నమ్మికొ
ని యుండుటఁ జేసి యనేక రీతులన్। బల్లిద
ముల్ వచించితిని రక్షక తప్పులు సైఁచి యేలు నే।
విల్లరవారిఁ గొల్వనిఁక శ్రీ రఘు నాయక దీన
పోషకా ॥౯౩॥

మదినె సుభద్రయందు నను మంజు గొడే
కుల వర్ధనుండు శ్రీ। సదనుఁడు జగ్గరాయనికి
సాధ్వికి జెల్లముకున్ తనూభవున్। ముదమునఁ జె
ప్పితిన్ శతకమున్ భవదంకితమై యొసంగఁబెం।
పొదవఁగఁ జిత్తగించు దయ నో రఘునాయ
క దీనపోషకా ॥౯౪॥

గణ నియమాదికంబులు వికాసపు ప్రాసలు
శబ్ద సంధులున్। ఘనవిరతిక్రమం బెఱుఁగ గౌ
రవమారఁగ భక్తవత్సలున్। జనువున దుష్కృ
తం బెడల సన్నుతిఁ జేసితి సత్కవీంద్రస। జ్జన
మణులార వేఁడెదను సత్కృతిగా సవరింపుఁ
డీకృతిన్ ॥౯౫॥

శుభమస్తు అవిఘ్నమస్తు.

---

# శ్రీవేంకటేశ శతకములోని
# పద్యములు-

# STANZAS FROM
# SRI VENKATESA SATAKAMU.

---

శ్రీకరంబగు కృప చేతనకోటులఁ- గనికరంబె
దఁబూని కావఁ దలఁచి। వరశరణ్యార్యులు కర
ము రంజిల్లంగ- రామానుజుం డన రహించి।
పతితపావనుఁ డంచు శ్రిత కల్పతరువంచు- దేశి
కోత్తముఁడంచు దాసజను। భాసురుం డితఁ
డంచు భాసురవైష్ణవ- సాగర పూర్ణ శశాం
కుఁడంచు॥ జనులు నుతియింప ధాత్రిపై జనన
మొందె। నతజనావళి రక్షించినావు కరుణ। దురి
తభరనాశ వైశాఖపురని వేశ। వినుతగుణ శ్రీని
వాసేశ వేంకటేశ॥ ౧॥

మంగా మనఃపద్మ మహిత లసద్భృంగ- ము
నిజనసందోహ మోహనాంగ। సన్నుత సారం
గ సామగానాసంగ- భూనుత కరుణారసాను
షంగ। పాదసంభవ గంగ, పరమశుభాపాంగ-
దేవారిఖలభంగ దివిజసంగ। భక్తదయారంగ

పక్షిరాజతురంగ- విమలాంతరంగ శోభితరథాంగ॥ మారవిస్తీర్ణ తాప తమఃపతంగ। విమతసార సమాతంగ వెన్నదొంగ। దురితభరనాశ వైశాఖపురనివేశ। వినుతగుణ శ్రీనివాసేశ వేంకటేశ॥

క్లేశపాశ వినాశ కీశాధిపాధీశ- కల్మష దానవ కంఠపాశ। షట్పదవరకేశ సన్నుతదాసేశ- గోసుతా హృదయేశ గుణనివేశ। లోకేశ లోకేశ లోకదుష్కృతనాశ- భజితకీనాశ భవుకదేశ- తారహార పటీర దరశరత్తారేశ- హారోపమిత కీర్తి పూరితాశ॥ రతిపతి సహస్ర సంకాశ రథనివేశ। మానినికరేశ రదజిత మాణిక్యకోశ। దురితభర నాశ వైశాఖ పురనివేశ। వినుతగుణ శ్రీనివాసేశ వేంకటేశ॥ ౩॥

దాక్షిణ్య విరహిత దైత్యలోకత్రాస- మానిమానస వాస శ్రీనివాస। కాంచన సుమ నాస కమనీయ దరహాస- పరహంసనాభ్యాస సురవికాస। సౌమిత్రి సహవాస సాధుముఖోల్లాస- మహనీయ శార్ఙ్గనామక శరాస। వైకుంఠ పురవాస వారిద సమభాస- సతత నతవ్యాస వితతదాస॥ చతురమృదు వాగ్విలాస కాంచనసువాస। బంధుర తరాజవంజవ భయనిరాస। దు

రితభర నాశ వైశాఖపుర నివేశ। వినుతగుణ శ్రీ
నివాసేశ వేంకటేశ॥ ౪॥

భువనమోహనవేష భూసుర సంతోష- కౌస్తుభ మణిభూష కలిత భాష। కారుణ్యపీయూష కామిత వ్రజపోష- భృగుమౌని శుశ్రూష విగతదోష। సురధునీసంభవ చరణపద్మ విశేష- దేవాద్రికులదోష దీనపోష। సాగరపరితోష సదముల సంతోష- పరభక్తమానస పద్మపూష॥ సురజనోన్మేష నిజిత గురుమనీష। ముని మనస్తోష సాదర వినతశేష। దురితభరనాశ వైశాఖపురనివేశ। వినుత గుణ శ్రీనివాసేశ వేంకటేశ॥ ౫॥

హరిసూతి పోషణ హరిసూతిభూషణ- హరిసూతిభీషణ శర విహారణ। పుణ్య జన త్రాణ పుణ్య జనక్షీణ- పుణ్య విచారణ పుణ్యచరణ। ధర్మ సంరక్షణ ధర్మవిచక్షణ- ధర్మవిదారణ ధర్మసుగుణ। శాంత సంభావణ శాంతవిలక్షణ- శాంతవిహారణ శాంత శరణ॥ దురిత దూషణ దుర్మత దుష్టహరణ। సృష్టికారణ తాపస సేవ్యచరణ। దురితభరనాశ వైశాఖ పురనివేశ। వినుతగుణ శ్రీనివాసేశ వేంకటేశ॥ ౬॥

ఈరేడు లోకముల్ చారణగంధర్వ- య

తుపిద్యాధరు లమరవరులు। సాత్యవతేయాది సన్మునీశ్వరులును- నిఖిల సత్కవులును నిగమములును। పద్మసంభవుఁడును భవుఁడును సురగణ- గురుఁడును పన్నగవరుఁడు నైన। తగురీతిఁ దావకస్తవము సేయఁగలేరు- నాకవశంబౌనె లోకవినుత॥ ఘోరసంసార బంధంబు జారిపోవ మదికిఁ దోఁచిన నుతిఁజేతు మదనజనక। దురితభరనాశ వైశాఖపుర నివేశ। వినుతగుణ శ్రీనివాసేశ వేంకటేశ॥ ౭॥

సరసిజంబుల మీరు చరణాబ్జముల తీరు- పల్లవంబుల నేలు పాణియుగము। పర్వేందుబింబంబు పరిహసించును మోము- కలువ రేకుల మించు చుకన్నుఁదోయి। బింబఫలంబును బెదరించు వాతెర- మువ్వపువ్వును లీల నవ్వు నాస। పంచేషు ధనువును వంచించు కనుబొమల్- కనకపు తళుకుల గదుము చెక్కు॥ లంసమగు నీనిజాకారమంతనాదు। హృత్పటావేశమై యున్న దెల్లుమఱతు। దురితభరనాశ వైశాఖపురనివేశ। వినుతగుణ శ్రీనివాసేశ వేంకటేశ॥ ౮॥

ఘనతర దురితముల్ పనివడి గావింతు- సర్వాపరాధనై సంచరింతు। నతిచంచలాత్మనై

యవివేకనైయుంను. బుధజనసేవకుబుద్ధిసారదు। భవదీయ మృదు పదపద్మంబు లర్చింప- భక్తి చాలదుగాని భావమందు। పెరుమాళ్ళపైనింతఁ బ్రేమ లేదేమని- చింతింతు నొకవేళ చిన్నదరి గి॥ నీకుఁగృప యింత నాయందు రాకయున్న। దాసురాలికి ముక్తి కాధార మేది। దురిత భర నాశ వైశాఖపుర నివేశ। వినుతగుణ శ్రీనివాసేశ వేంకటేశ॥౯॥

వరకరుణాకరా వంచన సేయంగ- నేనెంత దానను నిర్మలాత్మ। నిగమసన్నుత నాకు నీభక్తిఁగృపచేసి- దుర్బుద్ధిఁదొలగించు దోషరహిత। పాప విమోచనా పాపిక చాలదు- భవబంధములకింక భక్తవరద। లోకేశ భవదాజ్ఞ లేకుండ వర్తింప- దాసికి శక్యమా తపనతేజ॥ నిక్కముగ నేర మున్నది నీవె దిక్కు। కాచి రక్షించు నేఁడెంతఁ గరుణచేత। దురితభరనాశ వైశాఖపురనివేశ।వినుతగుణశ్రీనివాసేశ వేంకటేశ॥

వర గోడేశుల వార్ధిఁ పరిపూర్ణచందుఁౢ డు- శ్రీరామభాసుఁ డాశ్రిత ప్రియుండు। భూతజగ్గారాయు తరుణి చెల్లమయను. కాంతామ కర్గభజాత। మది నే సుఖదాత్రిఖ్య ముద

ముని శ్రీకరం- కందాళ దేశిక కలితచరణ। పంక
జ మకరంద పానభృంగము నాట- నిను బ్రస్తు
తించితి చనవుకతన॥ శతకమందున్న తప్పులు క్ష
మ యొనర్చి। నీకృపాపాత్రిగా నేలు నీరజాక్ష।
దురిత భరనాశ వైశాఖపుర నివేశ। వినుత గు
ణ శ్రీనివాసేశ వేంకటేశ॥౧౧॥

సకల సత్కవిజన సంఘంబు గొనియాడి-
మనవి గావించెద వినయ మలర। గూఢార్థ
మెంతయు గోచరించదు నాకుఁ- బొలుపార ప
దసంధి బోధపడదు। నయమైన గణవర్ణ నియ
మంబు తెలుఁగను- యతిపద్ధతియుఁ బ్రాసగతి
యు నెఱుఁగ। హరివరదునినుతి దురితహారంబని-
చేసితి నీకృతి చిత్తగించి॥ భక్తవత్సల నుతి గా
న భాకమనక। కినుకఁ జెందక నాయెడఁ గృపయు
లర్ప। పరిహసించక నెరసులు బాసిపోవ। శాం
తమొనరించి దిద్దుఁడీ సాదరమున॥ దురిత భర
నాశ వైశాఖపురనివేశ। వినుతగుణ శ్రీనివాసే
శ వేంకటేశ॥౧౨॥



శ్రీరాములు.



# శ్రీకేశవ శతకము.

# SRI KESAVA SATAKAMU.

శ్రీనళినాక్షు సన్నిభుని సేవకనీరజ లోక బాంధవున్। భానుసమాన తేజు భవబంధవిమోచనుఁ బద్మలోచనున్। ధీనిధి నస్మదీయ గురు దివ్యుని ద్రావిడ వేదవేదిరా। మానుజభాసురాఖ్యమని నంజలిఁ జేసి భజింతు కేశవా॥౧॥

కారణజన్మునిన్ దళితకర్మునిదీనజనానుకంపనున్। భూరివివేకునిన్ సుజనపూజిత పాదసరోజ యుగ్మునిన్। సారవిచారునిన్ మధురసాదరభాషుని భక్తపోషణున్। ధీరశాంతునిన్ వరద దేశికసత్తముఁ గొల్తు కేశవా॥౨॥

జనకజతోడఁ గూడి యనిశంబును వాయుజభానుజాదులున్। బనివడి సోదరుల్ బుధులు పార్థివ సత్తము లస్త్రదీక్షితుల్। వినయము లొప్పఁ గొల్వఁగ నవీనవిలాస విశాఖపట్టణం। బున వసియించు రాఘవునిఁ బుణ్యనిధిన్ భజియింతు కేశవా॥౩॥

కమలజు కన్నతల్లి నతకామఫలప్రద కల్పవల్లి భూ।, రమణుని పెన్నురంబ నెడి రాజితసద్మ

మునందు నిచ్చలున్। బ్రమదము నొందు కల్మి చెలి పంకజవైరి సహోదరీ మణిన్। సమరస మొప్పఁగా మదిని సంతతమున్ వినుతింతు కేశవా ॥౮॥

దానవలోక మర్దనుని దండిబలంబున శాధిపత్యమున్। బూనినమేటి కబ్జజ ముఖ ప్రభు ముఖ్య సమస్త నిర్జరుల్। మానుగ నగ్రభాగమున మన్నన నర్చనలిచ్చు నట్టి సే। నానికి విఘ్నహారికి దినంబు నమస్కృతిఁ జేతు కేశవా॥౯॥

పరమ తపోభిరాము హత పాతకనాశను లోకపావనున్। సురుచిర యోగ భాగ్య చయ శోభితు మారవికార దూరునిన్। సరసిజలోచన ప్రియము సాత్యవతేయుఁ బరాశరాత్మజున్। గురుతర తత్త్వసార నిధి గోరి సదా వినుతింతు కేశవా॥

నిరుపమ వేంకటేశ పదనీరజ లోలుని భక్తవత్సలున్। వరకరుణాలవాలు పరవస్తు కులాంబుధిపూర్ణ సోమునిన్। పరమరహస్యవేది కవిపాలన శాలిని సర్వవిద్యలన్। వెరవరి శ్రీనివాసగురు వేమఱు నే మతియింతు కేశవా॥౧౦॥

పొల్పిదలిర్పఁగాఁ దనమహత్తర సద్గుణముల్ రసజ్ఞులే। వేళ సభాంతరంబుల ప్రశంసయొనర్తురె

వినుతింప నేదవి। న్మాళియనందనర్చు నలిన ప్రి
భవాభుని పద్మనాభు గాం। గాళ సదన్వయా
బ్ధి మిహికాకరుఁ జింతనఁ జేతు కేశవా॥౮॥

రాగనివర్తనున్ విమలరాజిత కీర్తిని పుణ్య
మూర్తిఁనిన్। యోగవిచారుని న్వినుతయోగి స
మాన సమాధియుక్తు నా। నాగమసార తత్త్వవి
దు నంచితసోదర లోలు నాకవి వ్యాగురు సా
ర్వతీశ్వర వదాన్యుని నిచ్చఁదలంతు కేశవా॥౯॥

భూసుర మండనున్ కలితభూప వినోదనిస
తర్కవీశ్వరున్। భాసుర సంస్కృతాంధ్రము
లఁ బ్రౌఢవచో విభవాభిరామునిన్। దాసను
పోషాపకారకుని ధన్యచరిత్రుని సత్పవిత్రురా।
మేశను సువ్రితాకరుని మిక్కిలినమ్మిఁ జేతు కే
శవా॥౧౦॥

పన్నగ నార్యసత్తములఁ బ్రస్తుతిఁ జేసి మ
హోన్నతి నీకు నేఁ। జెన్నుగ నంకితంబుగ రచించె
ద వృత్తశతంబు నర్మిలిం। గ్రన్నన చిత్తగించి త
నరార లసత్కృప నేలుమన్న యా। పన్న శర
ణ్య భవ్యగుణ పాతకనాశ రమేశ కేశవా॥౧౧॥

ఇష్టము లేనిచోట నొకఘుంచుక చెల్మి ఘటిం
చినంత వి। స్పష్టముగా మదింగలుగు బంధురమ

ర్మము దెల్పఁగూడునా। సుష్టుగభార్గవుండు గు
రుపూతికి మంత్రిమొసంగి తానుబల్। కష్టము
నొందె శిష్యుతతి గాసిలఁజూడఁడె తొల్లి కేశ
వా॥ ౧౨॥

మన్ననదప్పియున్నయెడ మక్కువగల్గిన వా
రసేనియుఁ। దిన్నగ మందలించినను తెల్లము
గా మదినొవ్వకుండునే। యన్నకు ధార్తరాష్ట్రు
నకునాదరమొప్ప హితోపదేశమి। న్నెన్నఁగఁజే
సి యా విదురుఁడేమి ఫలంబును జెందె కేశ
వా॥ ౧౩॥

సురుచిర సంపదుత్కరము సుందర గాత్రము
గల్గియున్న బల్। దురుసునె తోడఁబుట్టువుల దు
ర్మతి గాసి యొనర్చ కుండునే। యొరపుగ శీత
భానుఁడు సహోదరినైన రమానివాసపున్। సి
రులు హరింపఁడేమదిని సిబ్బితి యింతయు లేక
కేశవా॥ ౧౪॥

చతురత సద్వివేకమును సజ్జనగోష్ఠియు రా
జదర్శనం। బతిరతి నబ్బఁజేసిన యనఘుఁడు
తండ్రికిఁగీడు సేయు మున్। హితవుగఁగంస భూ
పతి యించుక గొంకక యుగ్రసేనుని। వ్రి
తముగఁ గాకయుంటఁ బగవారలు నవ్వఁగ మం

చే గేశవా ॥౧౫॥

అతిథి మనోహరంబునగునట్టి పదార్థము
నంగలేక వాన్ప్రుతుండగు దాత నిషధ్ర ములనూన
ముగానిడ నిష్ఫలంబగున్ । హీనమురక్తము ధా
ర్త నకు నెంతయుఁ బాపులనీను గంధమా। యొ
త కృపమై నలంద ముద మందు నె యాకలిఁ బాసి
కేశవా॥౧౬॥

ప్రాకటలీల నాప్తులనుబాసి మనోవ్యథఁ జెం
దు వానికిన్ । నాకములభ్యమైన నొకనాఁడును సౌ
ఖ్యమునొంద నేర్చునే। శ్రీకర పద్మ పాన్నమును
చెల్వదలిర్పఁగ నారగించినన్ । తేకువ వారిగ్రో
లకయ తృప్తివహించునె ప్రాణి కేశవా ॥౧౭॥

నిలయము దిద్ది తీర్చుటకు నేరుపు చాలనివా
రి నుంచినన్ । జలువుగ తిన్నివేశనము భాసిలనే
రదు యెవ్విధంబునన్ । నలువుగ దోహదక్రియ
లొనర్పఁగనేరని వారిరక్షచే। కలితఫలద్రుపుష్ప
లతికాతతి గాంచు నె సొంపు కేశవా॥౧౮॥

తులువలు సాధుగంథమును దుర్నయవృత్తి
గ నెగ్గులాడినన్। గలఁగఁగ నేల తచ్చరితకల్మష
మొందఁగ నేర దెట్లనన్ । గలయఁగఁ దొక్క
సైరిభము కర్దమమూన్ గెరలించి పోయినన్ ।

గలితతటాక పూర్ణ యగు గంగ పవిత్రయ కా
దె కేశవా॥౧౯॥

దిటముగ తేమిఁ దెల్పుచును దీనతతోఁ బ్రతి
మాలుకొన్న హా। కఠినున కించుకైనఁ గనికార
ముపుట్ట దదెట్లకో యనన్। ఁటువగు రాతిబొమ్మ
తన పాదములం బడి వేఁడుకొన్నను। న్నటువలె
నుండు దానికి దయారస మేగతిఁ గల్గు కేశవా॥

ఎలమిని బుద్ధిదెల్పినను హీనుఁ డసహ్యము
నొంది మిక్కిలిన్। చలము దలిర్ప వానికి నశ
క్యపు కీడొనరించ నుండునే। చెలిమిగ నవ్విభీష
ణుఁడు సీతను రామున కిమ్మటన్నఁ దాఁ। బలు
వుగనల్గి రావణుఁడు పారఁగఁ దోలఁడె వాని కేశవా॥

సరసుని వాక్సుధారసము సారవిచారముగ
ల్గు వానికిన్। కరము రుచించుఁగాని యది గా
ధ పుమూర్ఖునకున్ రుచించునే। నిరుపమ గా
న మాధురికి నెమ్మదిఁ జొక్కు ఫణీంద్రు రీతిని।
ధరణిని దుందుభాములు ముదంబును జెందున
యెందు కేశవా॥౨౨॥

అవసరమున్న వేళఁ బ్రభు వల్లని పేరు వ
చించి నంతనే। వితరము లేక వాఁడు తనపిందుట
ముట్టుచు నిల్లు వెట్లినన్। జవమున వేఁటలాఁపల

ను జాగిలము న్మ్రొగయుండు బిల్వను। త్సవము
న దూరయాన జనితశ్రమ నూననిరీతిఁ గేశవా॥

ఘనతరమైన లోభమునఁ గాసును వీసము
నీయఁ జాలకన్। పనివడి ఘాతలాడి తన బంధు
లకున్ వెతసేయు దుర్జనున్। డనయము పాం
డవేయులకు హస్తిపురాధిపుఁ డెగ్గుసేయుటల్।
ధనమును గూర్చికాదె మురదానవదర్ప వినాశ
కేశవా॥౨౪॥

మృషలు రుఁ డెందునైన తన మోసము దోవ
మెఱుంగలేక యు। న్నిహపరసమృద్ధి నొందిక డు
నేర్పున వంచనసేయు నాప్తులన్। శుభకరమనీ
షుఁడైద మధువుఁ జొక్కుచుఁ గ్రోలిమదించిమి
త్రులన్। నిహరురూకాత రేకమున నిర్దయమర్ద
నసేయు కేశవా॥౨౫॥

నిస్తుల సుచరితాచరణ నిష్ఠగలట్టి వధూటితో
టివ్వ। త్యస్తపునీతులం జరపునట్టి దురాత్ముని జెం
దుహాని వి। చస్త్రముగాదు భూసుతను రావణుఁ
డెంతయుఁ దూలనాడితాఁ। బ్రస్తుతిమందుఁదత్ఫ
లము పాకటలీల భజించె కేశవా॥౨౬॥

కనలును బొంది పలుకునెడఁ గల్మష దూరు
ని కిల్బిషాత్మునిన్। ఘనతర శేముషీయుతుఁడు

గ్రక్కున నిర్ణయ మాచరించుఁడా। ఘనమున
నొక్కరూపమున వర్తిలు వాయస కోకిలంబు
లన్। ధ్వనివిని నంతలోనె గుణవంతుఁడు పో
ల్చిన రీతిఁ గేశవా॥ ౨౮॥

నరపతి నీతి దెల్పుమని నన్ గుణ హీనుఁడు
దెల్పఁ బోవునే। సరసగుణప్రపూర్ణుఁ డది సయ్య
నఁ దేటగఁ దెల్పునట్లుగా। సారదిగ లోష్టమందుఁ
గనఁ జొప్పడునే ముఖశోభ యేర్పడన్। సురు
చిర దర్పణంబునను జూడఁగ గనంబడు మాడ్కిఁ
గేశవా॥ ౨౯॥

మృదువగు భావగోత్కరము మిక్కిలిగా
శ్రవణ ప్రియంబు దు। మ్మదపరుషోక్తిజాలము
నిరాదరమై తగు సజ్జనాళికిన్। సదమల కోకిల
స్వనము సమ్మతితో వినవిష్ట మౌఁగదన్। యదికిని
వాయసధ్వనివిరోధకయుండు నెరొందు కేశవా॥

నరహరి భక్తిలేని నరనాథుని పుణ్యముఁ శ్రీ
విలాసమున్। కరసత సర్వవిద్యలును శాంతివి
హారము నిష్ఫలంబగున్। కరగున దంత ధావన
ము సల్పక నే యుపవాసముండిన। స్థిరముగ
సువ్రతం బులరఁ జేసిన చందమునొందు కేశవా॥

చల్లని రాఘవ ప్రభుని సన్నుతి ముక్తిఫలప్ర

దాఁ ఋయరా। చిల్లర దేవతా భజన చెన్నుగ వేరా
త్తు మొసంగ వింపు సం। థిల్ల ధనాఢ్యమాని క
డు దీనత వేఁడ దరిద్రు లిత్తురే। కొల్లగ వాంఛి
తార్థములను గోప వధూ హృదయేశ కేశవా॥

రసికుఁ డెఱుంగు నారసిక రాజ శిఖామణి మ
ర్మకర్మము। పెకుఁగఁగ ముదర్రాధముఁడు
నించుక యేని గ్రహింపనోపునా। పస గల పద్మ
గంధమును బంభరమానఁగ నేర్చినట్లు సం। తస
మున దర్దురం బెఱుఁగునా సహవాసము గ
ల్గి కేశవా॥౩౨॥

ఘనమగు లేమిచే నొగిలి కాపును హాఁపును
లేకదీనతన్। ధనబల దుర్మదాంధునకు దాస్యము
నర్చినవాఁడు వారలన్। కనలుసఁగీడు సేయును
బికంబులు నీడముఁ జేరి యాశ్రయిం। చినఁగని కా
కముల్ బెదరుజెందఁగఁ దన్నునుగాదె కేశవా॥

కార్యవశంబుచేత నపకారిని ధీయుతుఁడైన
వాఁడు సా। కర్యముగాను దెల్పినను కాని ప్ర
యోజనమాను నీచమే। యార్యులు మెచ్చుచం
దమున నానక దుంకుభి నేర్పు మీఱఁగా। భార్య
ను నర్తిలిన్ మ్మతిఁ బాపఁడె కంసుని వేఁడి
కేశవా॥౩౪॥

అవసర సక్తుఁడైన నృపుఁడల్ప కులోద్భవుఁడై
నవారిఁ బ్రా| భవమునఁ జెల్మిఁ జేసినను వంచన
గాఁ దది మంచదేయఁగున్| రవికుల వార్ధిచంద్రుఁ
డగు రాముఁడు రావణ నాశ నార్థమై| ప్లవ
గుల తోడ మైత్రి ననపాయతఁ జేసెను గాదె
కేశవా ||౩౫||

కరము మనంబులోఁ బ్రియము గల్గిన నెచ్చ
టనున్న మిత్రముల్| నిరతము సఖ్యముల్ విడు
వనేరరు నీరజముల్ దివాకరుం| డరమరలేక దూ
రముల యందు వసించియు నుల్లసిల్లుచున్| మ
రువక చెల్మి సల్పు గతి మా రమణీ హృదయేశ
కేశవా||౩౬||

యత్నము సేయ నెంత పని కైనఁ బ్రయోజ
కుఁడైనవాఁడు స| ద్రత్నము వంటి కార్యమున
న్యముగా సమకూర్చ నాతఁడున్| నూత్నము
గాఁగ వారిధి నమానజవంబున దాఁటి యంగనా
రత్నముఁ గాంచి వాయుజుఁడు రామునకీయఁ
డె వాతజా కేశవా||౩౭||

భగ్న మనస్కుఁడై జనుఁడు భావిశుభార్థ
ము వైష్ణవార్థము| దిగ్నతిఁ గొన్న నన్నెఱుఁ
త వేయు భవంబులఁ బోదు పాపముల్| మగ్న

ము నొందఁ జేయు నను నానుగ మీఁట నంచు
వెట్టితాఁ। దగ్ధపటంబునన్ ముడిచినట్లుగ దా
నవనాశ కేశవా॥౩౮॥

తరుణి కాయుక్తి నమ్మి పతి దండన సేయఁగా
రాను మొఱ్ఱగిన్। పరగఁగ రాజరాజనరపాలుఁడు
చిత్రశరీరి పల్కులే। తిరముగ నెంచి పుత్రకుని
ధీరవిచారుఁ సారంగధారునిన్। కరపదహీనుఁ జే
సి కలకాలము దుర్యశ మొందె కేశవా॥౩౯॥

స్త్రీకడ సత్యవర్తనఁ జరించుచుఁ గోరుఁ
లొసంగు భర్తదా। లోక విరోధియైనను తుది
రూఢిగఁ బ్రాణముఁ గోలు పోయెడిన్। కైకవ
రంబు గాదనక కానకు రాముని బంపి సత్య
రన్। నాకముఁ జెందెఁ బంక్తిరథనాముఁడు శో
కముచేతఁ గేశవా॥౪౦॥

చెంగటి వారలు న్యాగవ నిద్రిత శీలను దక్కి
యున్న జా। రాంగన వస్తుసంచయము నన్యుల
కిచ్చిన బ్రొవుమంచుఁ డ। న్మంగల వెనకఁ బం
ధువులు మూఁగి విలాపమొనర్ప దుర్జనుం। డంగ
ముఁ బాయుచోఁ బరుల కర్థము వ్యర్థము సే
యుఁ గేశవా॥౪౧॥

లేంకబుద్ధి వానికి నన్యప్రవశంబునఁ గల్గి గ

గ్గినట్టి। దూలఁగ నాఁడు సజ్జనుల దోషము లెం
చుచు మాటిమాటికిన్। చాలఁగ గుర్కురంబున
కు పక్ష్వ భోజన మిచ్చి పెంచినన్। దాలిమి
దక్కియున్ మెఱుఁగు దంతిచయంబును జూచి
కేశవా॥౮౨॥

బలియుని నాశ్రయించినను బౌరుష హీనత
లేదు దక్ష్యముల్। గలిగిన లేక పోయినను గష్ట
పు నీచుని ప్రాపు దూఱగున్। జెలువగు నా
ప్రమహాంఘ్రిని వసించిన మెత్తురు శాఖభూజవా। టి
ల వసియించు నాతఁ డెప్పుడుంగడు నిందుఁడు
గాఁడె కేశవా॥౮౩॥

కలిమి గలట్టి కాలమున గ్రొవ్వునఁ బోవ్వునఁ
జేరవత్తురా। కలిమి వినాశకాలమున గ్రొవ్వున
దమ్మునఁ బాసిపోదురు। జ్వలముగ భూమిభర్తలఁ జ
నుజాడల వేత్రము లాడఁగా జనుల్। పొలుపు
గఁజూడనోపుదురు పూర్ణ దురాగ్రహ మెత్తి
యాతఁడే। బలమునఁ దోఁచఁబోయినను పార
రె భీతిలి వారు కేశవా॥౮౪॥

తనువు బలంబునుం గలుగు సాధులు గొంద
ఱ మూలభృత్యులన్। ధనము నొసంగలేక వసు
ధాపతి పొమ్మనఁ గార్యహానియౌ। ఘనతర భా

రమోర్వ్యశము ఘంటముఁబట్టుటపూని యాకులం।
గొన కొని గ్రంథ మేగతిని కోవిదుఁడైనను వ్రా
యుఁ గేశవా॥౪౫॥

సర్వ విశేష కార్యవిధి సన్నపు దోషము
గాంచి కిన్కచే। గర్వనుమిఱఁగా విభుఁడు క
న్నుఱఁ జేసినఁ దానె గాసి యౌ। గుర్వనిపా
క శాకసుఁ జక్కంటిత లిఁ బరాభవించ తాఁ।
బూర్వము ఘోర దానవులు పోరికిరా భయ
మందెఁ గేశవా॥౪౬॥

ఒకఁడె చాలు తల్లికి గుణోజ్జ్వలుఁడౌ సు
తుఁ డింపొనర్పఁగా। దగఁసు లట్టి వారగు దు
రాత్ములనేకులు పుట్టనేటికిన్। చొక్కపుమా
ఘ్యమాల సికఁజుట్టినఁ దావియుసోయగంబగున్।
చిక్కని ఘాసపుష్పములచేరులు వేయును నేఁ
గేశవా॥౪౭॥

పలినవాని సన్నిధిని హృద్యముగా సకలో
పచారముల్। తాలిమితో ఘటించు నొక దా
సుఁడె చాలును యొందతేల ఖూ। పాలుని కాలి
వేళ్ళ నొక బంగరురత్నపు మట్టెఁ బూనఁగాఁ।
జాల వికాస మాను పది సత్తువి యిత్తడి వేలఁ
గేశవా॥౪౮॥

కరము దురాత్ముఁడైన చెలికాఁడు వచించి
సలీల కార్యముల్ । జరిపిన రాజు మోసపడు స
ద్వినయంబున దుస్ససేనుఁడున్ । మరువక కర్ణ
సౌబలులు మాటలచేత నె కౌరవేశ్వరుఁ । జెరి
పిరి పాండుపుత్రులకు సిద్ధవిరోధిని జేసి కేశవా॥

తనయులు సోదరుల్ సఖులు తల్లి పితామ
హులుఁ డాదిబంధువుల్ । జనని పురాకృతంబున
ను శత్రువైనను నిందకర్హుఁడే । ఘనముగ భ
ర్తృరాజుఁగాని గర్భమునఁ బుట్టువహించు నాతఁ
డున్ । మునుతను దిన్నవస్తువుల మూల్యము చెఁ దెట్టి
నయట్లు కేశవా॥ ౫౦॥

పూనిక మీరఁ దీవ్రముగఁ బొల్పుగ నర్థికిఁ
గూర్చిరుఁ డెంతయున్ । మానుగ నర్థమిచ్చి పలు
మాటలను జింతిలు దీనవస్తుఁడై । స్నానము చే
సి చేసియును శ్వేదమొప్పఁగ సత్వరంబుగా ।
నేనుఁగు పాంసు జాలమున హీనత బుచ్చిన
భంగిఁ గేశవా॥ ౫౧॥

వరగుణుఁడైనఁగాని నరపాల శిఖామణి
యైనఁగాని యున్ । హరికృప లేకయున్న గతి న
ల్ప సమాజముతోటి వాఁడగున్ । అరయఁగ నే
క చక్రపురమందున ధీయుతులైన పాండవుల్ ।

తిరిపెము దండి రేవురుము దీసుకపోయెడి దస్సి
కేశవా ॥ ౫౨ ॥

వరగుణ నీకు నొక్కతతి వందన సేయుతలం
పు పుట్టిరన్ । బరులకు భృత్యులై జనులు పూరు
షహీనత నొందకుందురే । పరమపవిత్రాజమాను
లగు పాండుకుమారకు లావిరాటునిం । దిరము
గ నొక్కయేఁడు కడు దీనతఁ గొల్వరె తొల్లి
కేశవా ॥ ౫౩ ॥

సంతసమొప్పఁగాఁ గుమతి సాక్షి నెఱుం
గ ఖల మానసంబున । నత్యంత పరాభవంబునను
దాప మొనర్చినపాణిఁ బొందుమున్ । దంతిపురా
ధినాయకుఁడు ద్రౌపది వస్త్రవితానహానినో ।
మెంతయు నిండఁబొందె మది నేమి వికాసముఁ
జెందెఁ గేశవా ॥ ౫౪ ॥

అలసటఁ జెందినైనఁ గడునెమ్మి యలుంచు విశి
ష్ట కార్యమున్ । సలుపఁగ నోపు నే ఘనుఁడు ముక్కు
దమొప్పఁగఁదీర్చి శర్వుపన్ । ల్లలిత శరాసనంబు
గని రాజులు మోపిడలేక పోవఁగాఁ । జెలువుగ
రాఘవేశ్వరుఁడు శీఘ్రమె రెండుగాఁడి త్రుంచెఁ
గేశవా ॥ ౫౫ ॥

కుదేని వృథంబులేని యనుమాన మనుష్యు

కంబట్టి కార్యమిం। పొదవఁగఁ జేయఁబూనిన సు
పూరుషుఁ డార్తిని జెందకుండునే। యదనున నఘ
షణముల్ గురియునంచును మేఘుని నమ్మి చేని
తన్। మదినడిపాడ కర్షకుఁడు దుర్దశఁ బొంది
వరిలఁ గేశవా।౫౬॥

క్రూరులతో నొకప్పుడును గూరిమి సేయఁ
గ రాదు చేసినన్। పారము మట్టనేర దని బా
ధకరంబును ప్రాణహాని యౌ। బారుగ నెవ్వఁడే
నియును పన్నగ మైత్రి ఘటించియున్నచో। నొ
రిమి సేయునే యసువులూడఁగఁ గర్వకయున్న
కేశవా॥౫౭॥

అనఘుఁడు ఘోరపాతకుని నాదర మొప్పఁ
గఁ జెల్మి చేసినన్। ఘనముగ తద్గుణం బతని గ్ర
క్కునఁ జెందు నదెట్లనో యనన్। వనిత కరాం
బుళంబు వగభాసిల కజ్జలమందు నంచునం। త
నె తనవర్ణమున్ దొలఁగి తద్గతిఁ జెందకయు
న్నె కేశవా॥౫౮॥

సారముగాఁ బ్రియోజనము కల్గను సద్గు
ణసాంద్రుఁడే దురా। చారుఁడౌ సర్పకోపఁ ద
ని నాగొనరించుటెట్లు కాని యొప్పినన్। క్షీరమున్
నే మేర్పరచు క్షిప్రమె హంసము కొంగ కాగ

కన్। నేరుపు చాల జెన్నుఁటికి నిర్జరవైరివినా
శ కేశవా।౫౯॥

చోరవగ నీప్సితార్థము త్రిశుద్ధిగఁ గోరు
మనీష యేర్తిక్। ఉరుగుసె యెన్నిఖంగులను వి
ట్టముగాఁ జపుడెంచు నీరనున్। స్థిరముగ ని
న్నుడేశమునఁ జేరకయుండఁగ నిల్పెనేక్యమే। క
రముబలంబు నైపుణము గల్గిసవాక్రికైన కేశవా॥

ఇచ్చక మాడనేర్చినను హెచ్చుగఁ గొండె
ముఁజెప్పనేర్చినన్। మచ్చిక మీఱ వారికిని మా
డలు చీరలుసొమ్ములిత్తురా।నచ్చగ నాటకంబున
దయారస మొప్పఁగ సత్యమాధవిన్। మెచ్చి
బహూకరించి చెలిమిఁగడఁ బ్రీతి యొనర్చు
కేశవా।౬౧॥

సంపదతే గతంబనుచు చల్లగపుల్లగ వెట్టివా
రలన్। సొంపెడ లంగనాడుఁ గడుచుల్కనమా
నిసి వానినైజమే। యింపుగ శష్మనంబు జనియిం
పఁగ కారుఁడు మాటిమాటికా। రంశముఁ బట్టి
కోయుఁగద రాజిలు దారువునైనఁ గేశవా॥౬౨

ఘనులఁ దిరస్కరించి జనకంటకులాడినదు
ష్ప్రలాపముల్। పనివడి తత్ప్రలాపకుల బాధ
యొనర్చి నశింపఁజేయుచూ। దుర్మనిపయి నుత్త

మోహత్త్వమ విరోధులు క్రోధులు భూతివైవఁగాఁ। గొనకొని వైచు వారి కవి గొప్పగఁ బైఁబడకు న్నె కేశవా॥౮౩॥

ఏలినవల్లభుండు తన కెంతయుఁ దర్జనే భజనాదులన్। శీలము దాపెనంచు మదిఁ జింత వహింపఁగరాదు వానికిన్। మేలది పీలుగా నురిని మేఘుఁడు వర్షము సర్వసస్యమున్। జాల సమృద్ధిఁ బొంద జన కన్నతిగా ఫలియించుఁ గేశవా॥౮౪॥

కలఁ తనుఁ జెంత విక్రుటమొ కాని విధాత్ముఁడు ఫాలమందునన్। దొలుత లిఖించి నంతయును దుఃఖము సౌఖ్యమున్ గొందుఁ బ్రాప్తములన్। వెలసిగ లోకమంతయును పిరడిగాఁ గలపోశనుండనే। సలతనుఁ బొందఁ జేసెఁగద నారదమాని నిపింత కేశవా॥౮౫॥

తులువలు నిందసేయ ముచిఁ దోచక సౌఖ్యము భాగ్యయోగ్యమున్। గలిత మహోహరంబునగు కార్యము మానదు యుక్తమోక్షముల్। వెలమి మఱుంగుచేరకను నింపుక నీలపు రంగుపోఁక నా। వసువ దహించునే నెలత వంత్య మొకింతయు లేక కేశవా॥౮౬॥

బహువిధసంపదల్ చెడును భాగ్యులకైన ఘటిం
చునంతనే। నహుషునికిన్ సురల్ మునులు నా
క మొసంగ శచీలతాంగికై। సహనము మాని
మోహపడి సంయమివాహనుఁడై యగస్త్యుచే। త
హాహహా గా శపింపఁబడి తానురగత్వము నొం
దె కేశవా॥ ౭౮॥

తేలికవాఁత్రోనయినఁ దెల్లనుగాఁ బగఁబూ
నవచ్చునా। కాలముచేత వానికిది గౌరవమో
గ్యత లేకయుండునా। లాలితసంపదల్ గలిగి రా
జులు వారలు మాత్రికంబులన్। నాలునకం ఘటిం
చి యొనగూర్పఁగఁబూనరె యెంక కేశవా॥ ౭౯

దగ్గిరచుట్టముల్ దనకు దప్పు ద్రోహమొన
ర్పనోర్చుఁ దా। నెగ్గులు సేయఁబూనఁదు సుహృ
జ్జనుఁ డించుకయైన వారికిన్। మొగ్గడలించి
తన్ భగిని మోసమొనర్చు ఖగేంద్రుమతయున్।
తగ్గకదుర్గేహమున దాస్యముఁ జేయదె మున్ను
కేశవా॥ ౮౦॥

క్షుద్రపువస్తుసంగ్రహము చాలఁగ నియ్యంచ
దిగూర్ప్వకన్నయ। క్షుద్రులకైన బ్రస్తుతము గొ
ల్వగ నీచము సంగ్రహించు హే। మాద్రిక దృఢనా
ధ్యునకు వైనను గోమయమ్ము బుండినన్। భద్రి

ముగా గృహంబులను భాసిలునేవరిశుద్ధి కేశవా।

అతిశయ భాగ్యవంతుఁ డగునట్టి తఱిన్ ఖలుఁ దెగ్గొనర్చు ని। గ్గతధనుఁడైన కాలమున గౌరవ భావముతోడ వర్తిలున్। ప్రతిదిన మగ్ని వేసవులఁ బర్వత కాననముల్ దహించు నా। క్ష్మతఁ దగి వానకాలమున సౌఖ్యమొనర్చునతండె కేశవా॥౮౨॥

అకుటిలులౌ భవార్తుల దయారసమొప్పఁగఁ బ్రోవకుండువే। మకరముచేతఁ జిక్కి కరి మాధవ నన్నుఁ బ్రోవవే యనన్। ప్రకటముగా సురల్ బొగడ భాసురచక్రముచేత నక్రమున్। శకలములై పడం దునిమి సయ్యనఁ గావవె మున్న కేశవా॥౮౩॥

క్రూరుఁడు కిప్పిరాఖ్యుఁ డిడఁ గూడ ద దేగతి నమ్మఁ గొల్చెదన్। జేరి వృకుండు మున్ను తనచే యొరు మస్తకమందు నిల్పినన్। బోరున వ్రక్కలై పడ శివున్ గని వేఁడిన యట్టిదానవున్। దారుణ నమ్మహాస్త్ర మతఁకే దాఁడఁబోవఁడె చేయి కేశవా॥౮౪॥

చిన్నది బుద్ధిలేని కడు దీనుఁడఁ బ్రోచినఁ గీర్తివంబగున్। క్రొన్నత దార్ఢ్యవతిఁ గాఁడను కాల

వశంబున లేమిఁ జెంది యా। పన్నతనొందఁగా
చి జనపాలుఁడు బత్త్రము లెంచుఫ్రూటలున్। జె
న్నుగఁదెచ్చి బోఁప్రిపి భుపిఁ జెందుమగదా యపకీర్తి
కేశవా॥౮౫॥

మృదు మధురంబుగాఁ బలుక మిత్రసంగత్వ
మునొందు దుర్జనం। డొడెఁగి చరించుచుండుఁ
బురుషోత్తముల ధర్జన మాచరింపఁగా। వదులుగనా
తి గూచిననను వంగు నవిల్లు బలం బెఱ్ఱంగాఁ।
గుదురుగఁ బూనెత్తుటకు గూర్చఁగ నేర్చి
నఁ గాని కేశవా॥౮౬॥

మచ్చిక నచ్చటం గలుగు మార్గ మెఱుంగక
నెట్టిచోటికిన్। జెచ్చెరఁ బాడఁ బోయినను పి
ల్చితి నొందు సుమోహనుండు తా। హెచ్చుగ
ధర్మరాజు సభ కేగి జలంబుల ముగ్గి భూమిపై।
వచ్చుగ మోకరిల్లఁ బడి హాస్య రసాస్పదుఁ డ
య్యెఁ గేశవా॥౮౭॥

ఎంతధనంబు గల్గిన నదెంత వివేకము గల్గి
యుండినన్। సంతత దుష్టబుద్ధియగువాని లభిం
చినవాఁడవెూగ్యుఁడా। శాంతియు దాంతియుం
గృపయు సద్విజవిద్యము గల్గి మత్సరి। పొంతుఁ
డు మంత్రియైన జన వల్లభు వందము నొంది

కేశవా।౮౮॥

బహుతర గర్వమొందినను బాధకరంబగు నె
ట్టివారికిన్। సహనము లేక ధాత దను సర్వజగత్ప్ర
తిసంహరుఁ బల్కఁగా। విహితముమీర వాణి ప
దివేల విధంబుల స్తోత్రిచెప్పఁగా। దహనుని బో
లి వేంకృతిమునఁ దప్పరిఁజూసి చరించె కేశవా॥

పూర్తిత సద్గుణం బులుకఁ బొందిదె యొకప్పు
డు సాధువైనని। స్సారముగా నచింపినను శాం
తవివేకపిహానుఁగా నరా। చారఁగనించరా ద
తని సార సుధారసమొల్కఁ బల్కఁగ। తీవ
రముగ గర్వానికినికీడు దలంచుటమే లె కేశవా॥

సంతత దుష్టచిత్తునికి సద్గుణ మొకొఁకవే
ళఁ గల్గి నన్। దొంతర చెల్మిఁ జేసినను దుగుణ
ణ మితఁడు మానెనంచు నా। వంతయునమ్మరా
దతని నంచితమైన భుజంగరాజమున్। జెంత
కుఁ జేర్చఁగా జనుని క్షిప్రము గర్వక యున్నె
కేశవా॥౯౧॥

అనయము శత్రుపై తిరిగి యక్కఱవచ్చిన
వేళ నెమ్మిగా। నెనరుగనున్న నాతనితో నెయ్య
ము సేయుదురే సురేంద్రుఁడే। తనరఁగ నబ్బలిం
గలసి తానుసుధంగని దైత్యనాధునిఁ। గొనుమనఁ

డయ్యె నిందకయుఁ గోత్రాన వేల్పులఁ గూడి కేశ
వా॥౯౨॥

పెద్దలనొవ్వఁ బలికినను వేగిరమే కమవర్తి
సద్మముం। దొడ్డికమీరఁ జేరు దరితోద్ధతుఁడై వి
హారింపవేమనిన్। బుద్ధిగనంతమంచు బహుబో
ధనొనర్చిన సంయమీంద్రులన్। పెద్దయుధిక్క
రించి తుదిఁ జేరె నతలంబున కేగె కేశవా॥౯౩॥

ఘనతరకల్మషంబు మదిఁగల్గిన శత్రువు కా
ర్యవాదియై। వినయవిధేయతల్ గలిగి వెంటను
విచ్చలు సంచరించినన్। గనికరమైన సజ్జనుఁ గ
న్నుఁ జూడఁగరాదు దిల్పపి। న్ననువునఁ బొంచి
పొంచి యొనర్చైనను భేకముఁ బట్టు కేశవా॥౯౪॥

పలికసత్ప్రయోజనము హాస్యముగా సవరిం
పనేర్చుధీ। శాలి ప్రధాని యొకరుఁడె చాలు
ను వీలుగ రాఘవత్వనా। పాలుని కార్యభాగము
ను భానుసుతుండు వహించి బుద్ధిచే। మేలుగని
ర్వహించి తనుమిక్కిలి సన్నుతినొందె కేశవా॥

చెలువుగఁ గాంతుపై సతికిచిక్కని మోహ
ము లేకయుండఁగా। బొలువుగఁ బెండ్లిసేయుట
కుఁ బూనఁగరాదు తెపాడదర్థమై। యలయ

క రాజపుత్రియగు నంబను భీష్ముఁడు తోడి తెచ్చి
నన్ । వలసినచోటికేఁగ యనుమతించితనైన వెతనొం
దె కేశవా॥౯౬॥

అనుమతి దప్పియున్నఁ దన యౌరసునైనను
నొవ్వఁ బలుకఁ బల్ । వసువున నయ్యయాతి కలి
శాప వశంబునన్నెరన్యధశన్ । గొనుమనఁగాయ
దుందు ప్రతికూలము లాడిన రాజ్యమేల నీ । త
నయులనహర్నిశ లౌదురని తాననఁడే దయలేక
కేశవా॥౯౭॥

నెనరు దయారసంబు కడు నెమ్మియు నమ్మిక
గల్గువారికిన్ । ఘనతరమైన నెమ్మనము గౌరవహీ
నతసొంది పాసినం । తనె మదిహత్తదే గతని తద్వి
ధమెట్లన పాలుకల్మషం । బున వికలత్వమొంది
యదిభొంకునె ముక్కటిలీల కేశవా॥౯౮॥

తప్పగసంచరించుచును దాలిమిమాలిదురా
గ్రహంబుతో । నొప్పుసుసాధు వంచనము నించు
కగొంకక చేయవచ్చునా । నుప్పునఁగాలకింకరు
లు మూఁగిన దుర్గతి సాధ్వసంబుచే । నొప్పగ
శాంగ భావమును బొందిన మొత్తరెవారు కేశవా॥

అలబియకమూర్ఖ చిత్తున కహర్నిశ మత్యభి

వృద్ధి గోరుచున్ । సొలపుగ దాస్యమున్ గలిపి
సృకులుచు వాఁడు నిరాకరించఁగాఁ । గలఁగుట
కంటె సజ్జనులుగాసిని జెందక వాని సన్నిధిన్ ।
మెలఁగక యెవ్వ రేమనిన మిన్నక యుండుట
లెస్స కేశవా॥౧౦౦॥

ఇలను వ్రతోపవాసముల హీనతనొంది కృ
శించి యాఁకటన్ । మలములమాడి దానమిడి మా
నుగఁ బుట్టుటంతె దేయుతుల్ । దలిపిగ నన్యుల
న్వదలి దేశికునిన్ భజియించి శౌరికిన్ । జులక
గరంజలెత్తినను జూరగ మోక్షముగల్గు కేశవా॥

భవహర మత్స్యకూర్మ కిటిభాసుర మాన
వసింహ వర్ణిభా। ర్గవ రఘురామ సీరధర రామ
జగద్ధితబౌద్ధ కలిక నా। మాంకిత దివ్యవైభవసమ
న్విత దేహ ఖగేంద్రవాహన। సత్వ గుణదోష
ముల్ దొలఁగ నాదర దృష్టిని జూడు కేశవా॥

నామదినీపదాబ్జముతు నమ్మికగాన వెణంగు
వైఖరిన్ । వేమఱుఁదోఁచ రీతిగను పిల్వఁ చిన్నప మా
చరించితిన్ । కామితమేమి లేదు నను గాచినసాం
పగు నీయడుంగు కెం। దామరలే భజించెదను
దాసిని సత్కృపనేలు కేశవా॥౧౦౩॥

ముదమున శ్రీగోడేవుల సముద్రసుధాకరుం
డుల్లసద్రమా। సదనుండు జగ్గరాయనికి సాధ్వి
కిం జెల్లమకున్ తనూభవన్। మహి వె సుభద్ర
సాంబరగు మానవతిన్ గృతినీకొసంగితిన్। సద
యాతం దప్పులన్నియును సాదర లీలను సైంపు
కేశవా॥౧౦౪॥

ఘనతర విశ్రమంబులు విశాగపు ప్రాసలు
శబ్దసంధులుం। గణనియమాదికం బెఱుంగం గం
జదళాక్షుని భక్తరక్షునిన్। జనువునం బ్రస్తుతిం
చితిని సత్కవులార మహాత్ములార స। జ్జనము
లార వేఁడెదను సత్కృతిగా నొనరింపుఁడీ
కృతిన్॥౧౦౫॥

ఘన పరిచర్యలందుం దగు కార్యములందును
ధర్మసంగరంబున శయనించు వేళలను భోజ
నకాలమునందునన్ క్షమా। గుణమున దాసి మం
త్రియనుకూలియు రంభయుం దల్లి ధాత్రిలా।
గున జరియించు భార్య కులగోత్రము లెంతయు
నుద్ధరించెడిన్॥౧౦౬॥

పరగంగం బంచపర్ణమ్ములప్రాయముం దాం
కను శౌరిమాయు గా। నరమురలేక నాలుగును నా

టును దాఁకను దాఁపు మాటుగా। సౌరదిగ్గోడ
శాబ్దమున జొచ్చిన పుత్త్రి మిత్త్రి మాటుగా।
సురవిర లీలగాఁదలఁప సూటియగున్ దలిదం
డ్రి కెంతయుఁ॥౧౦౭॥

నెమ్మి దలిర్పఁగూర్ధ ధరణీపతిదర్శన మా
చరింపఁగా। కమ్మనితాంబులంబయిన గారవ మొ
ప్పఁగ సంగడించు నీ। నెమ్మది నేలనుండెదవు నిర్ద
య మర్దన సేయ కీగతిన్। బొమ్మను టే మహాఫ
లము భూసుర సత్తమ వేయు నేటికిన్ ॥౧౦౮॥

సకలవిధంబుల న్సుమతి సఖ్యమొసర్చి వివేక
హీనతన్। బ్రికటముగాఁగ మైత్రి నెడఁబాసిన
వ్యాసల మొంద నేల తా। నుకుటిలలీల నగ్గలసి య
ర్థము చాత్రిణములుండ నిక్రియన్। వికలతనొం
దుటే ఘనమువృద్ధియు మేలును సజ్జనోత్తమా॥

కలితరసాల సూనములు గల్గిన వాడిగఁ దన్న
గంబు స। త్ఫలము లుగోరి చేరి పరిపక్వ ఫలంబుగొ
నంగఁబోవ నీ। వలమటఁజెందఁ దోలి యడివా
య సమానినఁగుండ నేలను। జ్వలనిశితాసితుల్యఘ
నదంచు నక్షంబుల దేహ మెప్పఁబ్రి। ద్దళ్ళుపడఁగ్ర
చ్చి చీరుటలుతప్పుట చాలదె కీరరాజమా॥౧౧౦॥

సరసత స్వాదుమాధురియుఁ జారు శరీరము
కాంతియుక్తమున్ । బరువము మార్దవంబు కడు
భవ్యము వర్ణన కెక్కఁ జేసియు । న్విరసము
నొంది నీహృదయ మింతగ వజ్రనిభంబుఁ జే
సెనే । వర సహకారసత్ఫలమ వారిజగర్భుఁడు
నిర్దయాత్ముఁడై ॥౧౧౧॥

సరసిజసంభవుండు మృగసంఘము ద్రుంచఁ
గఁ జేసె బేలనై । తనుతనుగఁ గుక్షిలోమృగమదం
బిడి యెల్లుగకొండెగాండ్రు । స్థిర రసనాగ్ర
మందిడినక్షిప్రము వారునశింతు రాతనిన్ । సర
సరతుల్ బుధోత్తములు సత్కవులున్ వినుతింప
మందురే ॥౧౧౨॥

సరసిజ పత్రమందు విరసంబుగఁ గర్వము
నొంద నేటికే । సగము విరాజమానముగఁ గాంత
లకంఠములందు నుండువో । నరపతు లెందఱేని ని
సునాడెము సేయు విభూతి గాదువో । స్థిరముగు
బిల్వకెక్కెనప్రసిద్ధి వహింతు వ్రనీటిముత్తెమా ॥

ఘనతరసౌరభోత్కరము గల్గని యింతవతే
పమేలవి । న్ననువగుదూపసరవవదు నవ్యగమంచి
తదివ్యవాసనన్ । గొనకొని నీకు నెక్కువగుకోటి

మణుంగుల కప్పురంబు నీ। మనమున నిట్టె పెగుట
లుమాను మిఁక్కైనఁ గురంగనాభమా॥౧౧౪॥

దక్షత లేనిమందిరము తథ్యము పల్కఁగ లేని
సాక్ష్యమున్। పక్షము లేని బంధువును భావమె
ఱుంగనివాని చెల్మియు। న్నక్షులు లేనిజీవనము
హాళిఁగ నోగిరమబ్బనట్టిరూ। కుక్షిసదానిగర్థక
ముగోగణపాలన కంసమర్దనా॥౧౧౫॥

సరసులు లేనిరచ్చయును సాముము నేరని సా
యభారమున్। సరసత లేని కూటమియు సారవి
చారము లేనిమంత్రియున్। నరపతి లేనిరాజ్యము
నునాగరికత్వము లేనినాట్యమున్। గరము సదాని
రర్థకము కంజదళేక్షణ లోకరక్షణా॥౧౧౬॥



# శ్రీకృష్ణశతకము.

# SRI KRISHNA SATAKAMU.



శ్రీకర రామానుజులనఁ। బ్రాకటముగ నవతరించి భక్తులఁ గరుణన్। సాకల్యంబుగఁ బ్రోచితి। పాకారిప్రముఖ వినుత భండన కృష్ణా॥౧॥

చేతన సంరక్షణ సం। ప్రీతిని వరదార్యుల నడి పేరనుధరలో। ఖ్యాతిగ నుదయము నొందితి। పాతకహర దైత్యవీర భంజన కృష్ణా॥౨॥

శ్రీరుక్మిణీ మనోహర। హారవిభూషణ శరీర శాంత విహారా। మారవికార విదూరా। నారదవినుత ప్రచార నగధర కృష్ణా॥౩॥

యాదవవంశ పవిత్రా। సాదరలక్ష్మీకళత్ర సారసనేత్రా। వేదవినోద చరిత్రా। మోదావహ చిత్రగాత్ర మురహర కృష్ణా॥౪॥

శ్యామలకోమల రూపా। రామావిమలానులాప రాజితవాపా। తామసయుతజనకోపా। సామజనుత గుణకలాప సాదరకృష్ణా॥౫॥

మందారకుసుమభాసిత। నందసుతా నందచరిత నతజనభరితా। కందర్పవైరిపూజిత। నందసునందాది ప్రణుత నరనుత కృష్ణా॥౬॥

శరణాగత సంతోషా। కరుణా యుత విగత
దోష కౌస్తుభ భూషా। ధరణీసుర సంతోషా। వ
ర గోపీ మోహ వేష భామా కృష్ణా॥ ౭॥

కరుణారసాల వాలా। నరపాల యశోవిశా
ల నవరసలీలా। వరచామీకర చేలా। సురనాథ
సుపుత్రిఖేల శుభకర కృష్ణా॥ ౮॥

పాండవ మధ్యమ సారథి। యండజరథ సు
రవినోది యసుర విరోధి। పండిత కరుణా వారి
ధి। మండిత శౌర్య నిధి గుడధి మాధవ కృష్ణా॥

బృందావన సంచారీ। మందార ప్రసవ ధా
రి మధుసంహారీ। వందిత వేద విచారీ। మందర
గిరి ధారి శౌరి మధునుత కృష్ణా॥ ౧౦॥

కలిహంగణ కలిత భాషణ। ఖలశోషణ కమలచ
రణ కమలాదరణా। బలభూషణ కరిపోషణ। బ
ల దానవనాశ బాణ బహురణ కృష్ణా॥ ౧౧॥

గోపాలక పరిపాలక। గోపాలక విమలకలి
త గోడాలోకా। తాపస లోకాలోకా। భూపా
లక జలధిచంద్ర బుధనుత కృష్ణా॥ ౧౨॥

నేరరు ఫణి రుద్రాదులు। నేరరు బ్రహ్మాదు
లైన నేరరు కవులున్। పారముముట్ట నుతించ
ను। ధారాధరవర్ణ నాకు దరమే కృష్ణా॥ ౧౩

మతికినిగోచరమగుగతి। సదయాత్మా నిన్భజింతు సదమలరీతిన్। ముదమలరఁ జిత్తగించవె। కదన భయంకరశరీర కలిహర కృష్ణా॥౧౪॥

గోనకొని భవదీయ కృతిన్। ఘన దోషము లున్ననైనఁ గమనీయ గతిన్। మనమున సజ్జను లెంతురు। గుణహీనులు నెంచకున్నఁ గొదువయె కృష్ణా॥౧౫॥

రసయుక్తముగాకున్నను। పసఁదనరిన తావకీన భజనము వలసన్। భసితంబగుఁ బాతకమని। పాసఁగఁ నిను సన్నుతింతు బుధనుత కృష్ణా॥౧౬

మేదిని వేఁడినఁ గరుణను। సాధుగ వసుదేవునకును సజ్జను లలరన్। గాదిలి తనయుఁడవగుచును। మోదమున జనించినావు మోహనకృష్ణా॥౧౭॥

నందునిసుతుఁడన జనములు। పొందుగ రేపల్లెకరిగి పోషింప మహా। నందముగాఁగ యశోదకు। మందరధర పెరిగితివుపమానుగఁ గృష్ణా॥౧౮

పూతన కుచముల విషమును। వాతనుమధురిమను బూని వంచనమున వి। ఖ్యాతిగఁ బాల్నీకిచ్చిన। చైతన్యముఁ బాపినావు చలమునఁ గృష్ణా॥

శకటాసురుఁడను దైత్యుఁడు। నికటముగాఁ

బైసిబడిన నిర్జరులు లరన్। ప్రకటముగాఁ బదహతి
చే। శకటముగాఁ గూల్చితివు వేంకట కృష్ణా॥

తొడపైని నిడుకొను జననికి। నడిగొండగ బరు
వునొంద నలువు దలిర్పన్। తడఁబడ సిగ భూస్థలి
నిడెఁ కసుమాయలసురు పరిశాత్తఘునుఁ డౌ కృష్ణా॥

అత్తరిఁ గంసుని యానతి। నెత్తురు గుడుచు దను
జుఁ డొకఁడు నిను సుడిగాలై। యెత్తుకొని పోవ
వానిని। కుత్తుక బిగియించి ధరను గూల్చితె కృష్ణా॥

ఒకనాఁడు తల్లి పెఁగృప। నకలేశ్వర యాఁవు
లించి సర్వ జగంబుల్। నికరముగా ముఖమం
దున। సుకరముగాఁ జూపినావు సుదతికి కృష్ణా॥

శీలుఁడు గర్గమహాముని। పాలుఁడ నిను నా
మకరణ భాసితుఁ జేసెన్। వీలుగ వసుదేవాఖ్యు
ని। లాలిత విజ్ఞప్తి వలనఁ గ్రమముగఁ గృష్ణా॥

పాడుచు ముచ్చటలాడుచు। కూడుచు గో
పాల బాలకోటికి తోడై। తోడగు హలధరుతో
డను। నాడితి బహుగతులఁ గరుణ నచ్యుత కృష్ణా॥

గోపాలసుందరాంబుల। భూపాటక చౌర్యలీ
లఁ బొందితి మిగులన్। గోపికలతో విహారము।
ప్రాపుగఁ గావించినావు బహుగాఁ గృష్ణా॥

పాలును పెరుగును వెన్నయు। చాలఁగ భ

క్షోంచి మిగులఁ జనువుగఁ దిరుగన్। లాలితముగఁ
జోరత్వము। చాలాయెను జారతనము వచ్చెన్
కృష్ణా ॥౨౭॥

గోపాలసతులు మదిలోఁ। దాపముగొనఁ
బాలు నెయ్యి ద్రావుదువనుచన్। కోపుగఁదా
వక జననికిఁ। గోపంబునఁ జెప్ప పోవఁగూడెను
కృష్ణా ॥౨౮॥

మన్నారగింపు మనుచును। మన్ననతో నయ్య
శోద మానుమటన్నన్। తిన్నగనీ పిడిన మ్మకు। మ
న్నాయు సఖులును ఘటించిరంటివి కృష్ణా ॥౨౯॥

వాసన యాఘ్రాణించని। హాసంబున నోరు
దెఱవ నఖిలజగంబున్। వాసిగఁ గానంబడియెన।
నాంసతికి విక్రమొదవ నలువుగఁ గృష్ణా ॥౩౦॥

జగమంతయుఁ గన్నులఁ గని। ఖగవాహనుఁడి
తఁడటంచుఁ గామిని దలపన్। నిగమార్థ విను
తరయమున। తగు మాయను గప్పినావు తల్లిని
కృష్ణా ॥౩౧॥

భ్రాంతిగొని నందసుందరి। కంతుని గురుఁడ
నుచు నిమ్మఁగానక మదిలో। నెంతయుఁ గొడు
కను ప్రేమను। సంతతమును లాలనంబు సలిపె
ను కృష్ణా ॥౩౨॥

తనయింటి యింతులందఱు। పనులందవిలియుం
డ నందు పడఁతుక కవ్వం। బునువుగఁ గైకొనిచె
రుగున్। గొనకొని తరువంగఁ జొచ్చెఁ గుదురుగఁ
కృష్ణా॥౩౩॥

నిద్దపు గజ్జెలు మ్రోయఁగ। ముద్దులు గులుకఁ
గను నీవు మురిపెము దనరన్। తద్దయుఁ బాలి
మ్మనుచును। రద్దుగ కవ్వంబు పట్టి లాగితి కృష్ణా॥

నిను తనయూరుల పైనిడి। వినయముగాఁ జ
న్నుగుడిపి విస్మృత లీలన్। మునుగాఁచు పాలు
పొంగిన। ఘనతరముగ డించిపోయెఁ గ్రక్కున కృష్ణా॥

అత్తఱి దధికుంభంబును। బొత్తిగ పోఁగొట్టి
వెన్న భుజియింపఁగఁ ద। చ్చిత్తమునఁ గినుక గొ
ని నిను। తత్తరముగ తల్లిచూచి తరమఁగ కృష్ణా॥

చని వేఱొక యింటికిఁ జని। పనివడి రోట
నువసించి భాసుర లీలన్। దిని యుట్టిమీది వెన్న
యు। ఘనముగ వనచరము కొసఁగఁ గనియె
ను కృష్ణా॥౩౭॥

కనుఁగొనికినుక జనింపఁగఁ। జనువుగ నినురో
టఁగట్టె సమ్మతి దనరన్। మనమున నారదవచ
నము। పనివడి పాలింపఁ గట్లఁ బడితివి కృష్ణా॥

ఎటువంటి మనసుగలదో। పటుమతి గోపా

లవనిత భక్తుల కెందుఁ| ఇటువంటి చనువు గ
లదే| ఘటనాఘటనాసమర్థ ఘనుఁడవు కృష్ణా॥

గోత్రధర నీదు కరుణకుఁ| బాత్రులుగారె
వరు గోప భామిని మాడ్కిన్| మిత్రాసుమధర
సారస| పత్రాక్షికిఁ గలదె యింత భాగ్యము
కృష్ణా॥౪౦॥

గాత్రమున నుండదు నిందిర| పుత్రుండసుప
ద్మజుండు పుణ్యుఁడు హరుఁడున్| మిత్రుఁడు
యశోద తల్లియు| చిత్రమతే నీకు లోక సేవిత
కృష్ణా॥౪౧॥

మన్నులఁగూల్చుటమదిలో| సద్ధర్మంబనుచుఁ
దలఁచి సరగునఁ జనవే| పెద్దయులూఖలమీడ్చు
చు| ముద్దుగ కుజసన్నిధికిని ముదమునఁ గృష్ణా|

అర్జునయుగ్మము మధ్యకు| నర్జునసఖ
నీవుపోయి యడ్డుగఁ బైకిఁ| నిర్జరనుత రోలీడ్చి
న| గర్జితగతిఁ గూలెఁ దరులు గ్రక్కున కృష్ణా॥

వృక్షంబుల సలలితముగ| యక్షులు నిద్దఱు
జనించి యాదవకులసం| రక్షక తావకపదములు|
రక్షకమని మ్రొక్కి రపుడు రతిచేఁ గృష్ణా॥౪౪॥

తల్లియగు గోప కాంతకు| నెల్ల సుఖంబులు
ను గలుగ నెంతయు ముద్దుల్| కొల్లలుగాఁ గృప

సేయుచు । నుల్ల మలరఁ బ్రొద్దు జరుపుచుంటివి
కృష్ణా ॥౪౫॥

బృందావనమునఁ గలిగిన । సందేహము లేక
దైత్యసంచారంబున్ । జెందదు హరికని నినుగొ
ని । యందఱు నానందముఁ జరిగెనటకును కృష్ణా ॥

గోపాలబాలకులతో । క్రేపులమేపుచు నడ
విఁ జేరుచుఁ గ్రీడల్ । గోపులకు తీపెలుట్టఁగఁ ।
బాపహరా నలిపితౌర బహుగాఁ గృష్ణా ॥౪౭॥

నినుహింసింతునటంచును । మనమునఁ దలపో
సి దైత్యమానితుఁ డొకరుం । డనువగు లేగవిధం
బున । చనుపుగ నీ వెంటఁ దిరిగెఁ జలమునఁ గృష్ణా ॥

మంచిదివత్సంబనుచును । వంచనమునఁ గా
ళ్ళు తోక వరబట్టితగన్ । ఇంచుక వేఁగమునొట్టితి ।
కొంచెపు వత్సాసురుండు కూలెను కృష్ణా ॥౪౯॥

బకమై దానవుఁ డొకరుఁడు । సకలేశ్వరు
ద్రుంతునముచు నరగునని పై । పకటము గామా
ర్గానినను । వికలముగాఁ గూల్చితీవు పింతగఁ గృష్ణా ॥

దనుజుఁడు పెనుబాముగుచును । గొనకొని గో
వత్సములను గోపాలకులన్ । నినుమ్రింగినఁ గం
తంబున । ఘనకాయము పెంచి నేలఁ గలిపితి
కృష్ణా ॥౫౧॥

పాపవిషంబునమ్రింగిన| పాపల లేఁగలను గృ
పనుబ్రతికించితగన్| బ్రాపుగఁదోడ్తాఁగని యిం
టికి| దాపుగనరిగితివి చాలదయతోఁగృష్ణా||౫౨

తావకమహిమలుగనితన| భావములోఁగమ
లజుండు భ్రాంతుండగుచున్| యేవిధిపత్స్వా భట
కులను| చావఁగబ్రతికించె ననుచుసరగునకృష్ణా||

మెండుగదూడలకొలకై| యండజరథ నీవుపో
వనాలేఁగలతో| నిండగుబాలుర గుహలో| దం
డిగఁ బ్రహ్మాసనుండు దాఁచెను కృష్ణా||౫౪||

కేళ్రిపుఁ జెలులనుగానక| యీపని విధిచేసె
నెంతవెడఁగతఁడనుచున్| గోపులగోపుల రూప
ము| లేపుగధరియించిమందకేగితి కృష్ణా||౫౫||

ఒకయేఁడిగతిజరిగిన| సకలమయినగోప వత్స
సమూదాయింబున్| నికరముగానీరూపుసఁ| బ్రక
టముగాఁగానఁ బడిరొ బ్రహ్మకుఁగృష్ణా||౫౬||

చూచి కనుమూసి భయమున| నీచపుపనిఁ జే
సితనుచు నెటి గోపకులన్| దాచిన వత్సలనిచ్చి
యు| నీచిత్తముగరుగఁబొగడె నెమ్మినికృష్ణా||౫౭

పావనపొగండంబున| గోవులఁగాచితివిస్రాం
టిగోపకులరన్| సేవకులుసంతసింపఁగ| భావ
జరూపస్వరూప భవహర కృష్ణా||౫౮||

సుందరమగు గోవులఁ గాచి। మందకుని వేగ
గోపమదవతి వేడ్కన్। పొందుగ మజ్జనభోజన। చం
దనకుసుమాది విధులు గలుపుచు కృష్ణా ॥ ౫౯ ॥

ధేనుకవనమున కరిగియు। మానుగ ఖరదైత్యు
డని మెమసలక హాలముం। బూనిన రాముఁడు నీ
వును। వాని భటులఁ జంపితౌర మజవక కృష్ణా ॥

గోవులు గోపాలకులును। లావగు కాళిందిజ
లము రంజితమతు త్రై। వ్రాపుచు నసువులఁ బాసి
న। శ్రీవిలసిల్లంగ బ్రతుకఁ జేసితి కృష్ణా ॥ ౬౧ ॥

కాళియు సంపర్కంబునఁ। గాళిందికి నిర్మల
తయుఁ గలుగదటంచున్। నీళాధవ కాలాహిని।
పాలనమున వేఱు నదికిఁ బంపితి కృష్ణా ॥ ౬౨ ॥

ఆరాత్రి దావదహనము। ఘోరముగాఁ
బైనిగవయ గోపజనంబుల్। పారాముల ముగవేఁ
డిన। దారుణముగఁ గారుచిచ్చుఁ ద్రావితి కృష్ణా ॥

పొందుగఁ బ్రలంబదైత్యుని। కందుక క్రీడను
చుఁ జేసి ఘనుఁడగు హలిచే। నందముగాఁ జం
పించితి। నందకధర యప్రమేయ నయముగ
కృష్ణా ॥ ౬౪ ॥

దావానల భయమున తముఁ। గావను గోప
కులు వేఁడఁ గరుణను కన్నుల్। సేవకుల మూ

సుకొమ్మని। పావకపానము నొనర్చి పరిబలితి కృష్ణా॥

గోపకులాఁకటిచేఁగడు। తాపముగొని య
శనమడుగ ధరణీసురులీ। దాపున నున్నా రడు
గుఁడు। పాపహారులు నిడుదురనుచుఁ బంపితి
కృష్ణా॥౮౮॥

చలి వారలు బ్రాహ్మణులను। గని యద్వచన
ములు దెలుపఁ గలుషముతోఁ జే। దనిరన్నము
తద్వ్రతఱయు। విని మీరలు వారి సతుల వేఁ
డఁగఁ గృష్ణా॥౮౯॥

పంపిరి యోగిరమున్నకై। సొంపారఁగ గోపు
లరిగి సుందరులారా। పెంపుగ నాఁకొని శ్రీహ
రి। పంపెను యాశమున కనిన భక్తిని కృష్ణా॥౯౦

సురుచిర సంపన్నంబై। శరము పెప్పిడి బోజ
నంబు ఘటములనిడి వా। రరిగిరి బంధులు వలద
న। సరగున త్వత్సన్నిధికిని జానుగ కృష్ణా॥౯౧॥

భూసురకాంతలు దెచ్చిన। భాసురతర భక్ష్య
ణములు బంధుల పఙ్క్తిన్। వాసిదలిర్ప భుజిం
చితి। దాసులయినవారియందు దయచే కృష్ణా॥

ఇంద్రి సవనంబు చారున। గేఁద్రి మునకు
నాచరింప నింద్రుండలుకన్। సాంద్రముగ శి
లావృష్టిను। పేంద్రి వడిఁగురియఁజేసె వినూ

ఁక కృష్ణా॥౭౧॥

గోవర్ధనగిరి యెత్తితి। గోవులు గోపాలసతులు గోపాలకులున్। కావక యమునననుండి రి। నీవేపరతత్త్వమనిరి నిజముగ కృష్ణా॥౭౨॥

తగనాఁటి నొక్క దినమున। పగలును రాత్రియును గురిసె బలువగు రాళ్లం। బిగు వెడలి చేత గాళను। వగనొంది బలారివచ్చి వలనుగ కృష్ణా॥

అపరాధిని నేపమెన్నక। కృపసేయ వె సన్నుటించుఁ గిల్బిష మెడలన్। తపియింపుచు తత్పదములు। జపియించెను భక్తివజ్రి చనువుగ కృష్ణా

దీనతను శచీనాథుఁడు నానావిధ నతులొనర్చి నయమొప్పంగా। గోనాథునిగా నిన్నును। మానుగ నభిషిక్తుఁ జేసె మన్ననఁ కృష్ణా॥౭౫॥

నందుఁడు వారివాసరమునఁ। బొందుగ నుపవాసమునను బూత చరిత్రున్। నందక ధరుఁ బూజించియు। మందమతిన్ నాటిరాత్రి మసలక కృష్ణా॥౭౬॥

స్నానము రాక్షసవేళను। మానుగనొనరింప వరుణ మందిరమునకున్। ధీనిధి నందునిఁ గొనిచనె। దానవుఁ డొకఁడేగుదెంచి దబ్బునకృష్ణా॥

అత్తజ్జనకుని పోకడ। చిత్తంబున గోచరిం

చి చెన్నుగ మీరల్। పొత్తుగ నచటికి నరిగిన। తత్తరముగఁ బూజచేసి తగవుగ కృష్ణా ॥ ౭౮ ॥

నందుని వరుణుఁ డొసంగిన। నందమలరఁ దిరిగివచ్చి నలువుగ నీవా। నందాదిగోపకులకును। సుందరముగ బ్రహ్మపురముఁ జూపితి కృష్ణా ॥ ౭౯

సందాదులు జాతరచని। యందముగా భవుభవాని నర్చించితగన్। పొందుగనుపహారంబిడి। యందముగా నిద్రబోవ నలవుగ కృష్ణా ॥ ౮౦ ॥

ఆఁకొని యురగము నందుని। ఢీకొని కరచియును మ్రింగడివురఁ గనీవా। లోకించి త్రొక్కుటయు ద। ర్వీకరరూపంబువాసి పెంపుగ కృష్ణా ॥

సుందర విద్యాధరుఁడై। పొందుగ జోహారొనర్చి పూరిత నుతులా। నందముగ నొనర్చియుతను। బొందినగతి విన్నవించి పోయెను కృష్ణా ॥

ఈడితముగ సత్య మొదలగు। సుదతులు నెనమండ్రి మఱియు శుభగుణయుతలన్। పదునాఱు వేలనూర్వుర। ముదితల నుద్వాహమైతి ముదమునఁ గృష్ణా ॥ ౮౩ ॥

ప్రద్యుమ్నాదులఁ బలువుర। ఖద్యోతప్రభల మీరు ఘనులను గంటయున్। చోద్యముగా ధారణిలో। మిథ్యాసంసారివగుచు మెలఁగితి కృష్ణా ॥

మురనరక కంసయవనుల। శిరముల ఖండించి మించి చెలువుదలిర్పన్। సురుచిరముగ ద్వారకలో। నిరతమును వసించినావు నెమ్మిని కృష్ణా॥

శ్రీమీన కూర్మపోత్రీ। ధీమహితా నారసింహ దివిజారిహరా। వామన రామా రామా। రామా హరి బౌద్ధ కలికి రఘువర కృష్ణా॥౮౬॥

కృష్ణా దానవనాశన। కృష్ణా పాషండదహన కిల్బిషహరణా। కృష్ణా కంసవిదారణ। కృష్ణా వసుదేవప్రముద్దుకీరమ కృష్ణా॥౮౭॥

కృష్ణా ముద్దులకృష్ణా। కృష్ణా గోపాల బాల కృష్ణా కృష్ణా। కృష్ణా మోహనకృష్ణా। కృష్ణా నవనీతచోర గిరిధరకృష్ణా॥౮౮॥

కృష్ణా భగవద్భక్తియు। కృష్ణా భాగవతసేవ కిల్బిష మెడలన్। కృష్ణా దేశికప్రీతియు। కృష్ణా మోక్షైకదానసంగుకృపతోఁ గృష్ణా॥౮౯॥

శతకంబను తులసీదళ। మతి ముదమున త్వత్పదాబ్జమందున నిడితిన్। హితవెలఁగి చిత్తగించవె। గతినీవే భక్తవరద ఖలహరకృష్ణా॥౯౦॥

మదినె సుభద్రను దాసిని। సదమలమగు త్వచ్చరిత్ర చనువిచ్చుటచే। నొదవుచు సన్నుతి జేసితి। మదితప్పుసహించియేలు మాధవ కృష్ణా॥

యతి ప్రాసలు గణగుణములు । నతిమాత్రం
బెఱుఁగ హరిని యాదవకృష్ణున్ । నుతియించితి భ
వహరమని । మతిమంతులు తప్పు దిద్ది మన్నించ
రయా ॥౯౨॥

శిలపైఁ గలపము నలదిన । పొలుపుగ మాజాల
నాథ ముక్తము దినినన్ । జలమున నరూపముఁ జూ
చిన । యలయింద్రశ్రీకినైన హానిజనించున్ ॥

గుడి మోచు ప్రతిమ వలెనీ । యొడమాయను
మునిఁగి జనులు రెంతయుఃభవమే । వదువునగడు
పుదు మోయని । కడు భరము వహించి యుం
డు ఘనముగఁ గృష్ణా ॥౯౪॥

పలుకులకుఁ దగిన పలుకులు । పలికినఁ దత్క్షణమె
పలుకబాగా నపుడున్ । బలుకక వేనుకను వగచు
ట । పలుగాకితనంబు మిగుల పందతనంబున్ ॥౯౫॥



# శ్రీ సింహగిరి శతకములోని పద్యములు.

# STANZAS FROM SRI SIMHAGIRI SATAKAMU.



శ్రీకరంబుగ ధాత్రిఁ జిత్రభూసుందరా-కారంబు గైకొని కాంతిదనర। వరశేరణ్యాచార్యవనితగర్భంబున-సజ్జనులలరంగ సంభవించి। రామానుజాచార్య నామంబుధరియించి-కరుణాలవాలుఁడుచిరయశుండు। కందాళవంశాబ్ధికలితశశాంకుండు-సదమలవిద్యావిశారదుండు॥ పతితపావనుఁడని బుధుల్ బ్రస్తుతింపఁ। బ్రోలుపుదనరారభక్తులఁబ్రోచుతీపు। సింహగిరిభూష నిర్మలాంచితమనీష। మధురసంభాష హార్యతమనుజవేష॥౧॥

కలితారిసుతతోష ఖండితాశ్రితదోష-సనకాదికృతనిజస్తవనఘోష। నతసురవ్రజనుత వితతాసురద్వేష- యనిశచందన లేపనాభిలాష। రచితపాధూన్మేపరంజితవ్రజఘోష- కమలావధూమనఃకమలపూష। విహితార్యశుశ్రూషవిలసద్గుణ విశేష- ఘనహతాసురరాజకదనరోష॥ యాత్మశయనీ భవతోఁ మహాంగ శేష। య

మిత కారుణ్యా పరిపాలి తాంబరీష। సింహాగిరి భూప నిర్మలాంచితమనీష। మధుర సంభాష హార్యత్తమనుజవేష॥౨॥

లక్ష్మీసతీస్వాంత రాజీవ ఖరకరా- నగరాజ ధీర వినాశదూర। విమలకోవిద నేత్ర కుముదని శాకరా- శంధి గంభీర లోకైకవీర। గురుతరా శ్రితదోష గోత్ర పురందరా- వర శుభాకార పావన విహార। పరవీర మాతంగ భంజన హరి వరా- యతి మహోదార వేదార్థ సార॥ భూరిసౌరభ పాటీర సార లేప। రంజిత శరీర ఘోర శాత్రవ విదార। సింహాగిరిభూప నిర్మలాంచిత మనీష। మధుర సంభాష హార్యత్త మనుజవేష॥౩॥

సూత్రవతీజాని సుగుణ వ్రజాస్థాని- సేనానినతిభక్తిఁ జెంది కొల్చి। కలిత దాసోల్లాసుఁ గంసారి సంవాసుఁ- బరమవిద్యాభ్యాసు వ్యాసుఁదలచి। యతిగమ్య గుణసాంద్రు నభినవశశిచంద్రు- శ్రీనివాసబుధేంద్రుఁ జేరమ్రొక్కి। నవ్య పల్లవపాణి భవ్య మోహనవాణి- నకలేశ్వరునిరాణి సంస్మరించి॥ రసికజనముల మనములు రంజిలంగ। సీసశతకంబు చెప్పెద చిత్తగిం

చు। సింహగిరిభూప నిమ్నగాలాంచితమనీష। మ
ధురసంభావ హార్యత్తు మనుజవేష॥౪॥

గరుడ విద్యాధర గంధర్వకిన్నర- సాధ్యులు సిద్ధులు చారణులును। యక్షులు గుహ్యకాధ్యక్షులు సన్మునుల్- నిఖిలాగమంబులు నిర్జరులును। శేషుండు భవుఁడును భాషాధవుండును- సురలోక విభుఁడు నిర్జర గురుండు। తగు లీలఁ దావకస్తవము సేయఁగలేరు- దాసికి శక్యమా ధన్యచరిత॥ నేరనుతెన్నఁ గకృపఁజూడు నేర్చుకొలది। దురిత మెడలంగ నుతియింతుఁ దోఁచినట్లు। సింహగిరిభూప నిమ్నగాలాంచితమనీష। మధుర సంభావ హార్యత్తుమనుజ వేష॥౫॥

భక్తి చేనీపదపంకజయుగళంబు- భావించి సేవించిపరిస్తుతింతు। నని నేరచింపఁబూనిన యట్టి భవదీయ- కృతికతిసుందరాకృతియు మెఱుఁగు। నవరసమాధుర్యసువిమలగాంభీర్య- మార్దవంబులును నమ్మదము నీను। ఘన వాగ్విజృంభణంబు నునిమ్ము తపసుండు- భువనంబునఁదమంబు బోరయకుండఁ॥ జేయుచవదుపునకృతి నేరెము డలను। తప్పులను జెందకుండఁ గఁడనరఁజేయు। సింహగి

రిభూవ నిర్మలాంచితమనీష। మధురసంభావ
హార్యత్రమనుజవేష॥౬॥

తనియఁ బండకయుండ మునుగోసి భద్రము-
గావించఁగాచవిగల్గకుండు। నుత్తమతరమైన వి
త్తనంబులకును- భద్రమదప్పనుసదమలముగ। సు
రుచిర లీలను పరిపక్వమైయున్న- ఫలము ఫలంబి
చ్చుబంధురముగ। బీజముల్ ధాత్రిని బెంపార
హత్తింప- వృక్షంబులైసొంపువెలయుచుండు-
కార్యసిద్ధిక్రమంబిది ఘనులకైన। కొన్నిరయము
నఁ గావింపఁ దిన్నఁబడవు। సింహగిరిభూవ ని
ర్మలాంచితమనీష। మధురసంభావ హార్యత్రమ
నుజ వేష॥౭॥

చక్కెరపాకంబుమిక్కిలిమృదువైన- జిగిబి
గిజాలక శిథిలమౌను। పదునుదప్పకయున్న ప్రివి
మలంబలరార- నుతినొందివెలుఁగొందు నతిరస
ములు। నదియుఁగకఠశమైనఁ బదివేలవిధముల.
కొమరార నేచఁగానే కొదువలుడిగి। యావిధం
బునసుండు నేపాటుగాపాక- కార్యంబు తద్గతి
క్రమము మీఱ॥ నెటిఁగివర్తింపసౌఖ్యముల్ నె
జీవహింపు। తెలియకున్నఁ బరిక్రమ దొలఁగఁ బ

శమె। సింహగిరిభూష నిర్మలాంచిత మనీష
మధురసంభాష హర్యక్ష మనుజవేష॥౮॥

అగ్నిహోత్రంబింటనంటిన యంతనే- చ
ల్లార్చకున్నను సమయబడును। బదులు దీర్చక
యున్న పాయిదా మిక్కిలి- విస్తీర్ణమై కోశవి
కలమవును। కన్యకుఁ బెండిలి కాలంబు దప్పిన- మఱి
దిమినొందును దానిఁ గదియ రెవరు। కావునఁ
గార్యముల్ గావించవలెఁ గొన్ని- సత్వరంబ
లరార సముచితముగ॥ బహువిధంబులఁ దత్కార్య
భావ మరసి। నిర్వహించంగ వలయును నేర్పు
కలది। సింహగిరిభూష నిర్మలాంచిత మనీష।
మధురసంభాష హర్యక్షమనుజవేష॥౯॥



# శ్రీరాఘవరామ శతకము.

# SRI RAGHAVA RAMA SATAKAMU.



మేరునగధీర వీరా। పారాచారపవిచార సాధువిచారా। పారావార విహారా। రారా నను కరుణఁబ్రోవ రాఘవరామా ॥ ౧ ॥

వైశాఖపుర నివేశా। నాశకపాతక విదళన నరవరమేశా। యీశా క్లేశవినాశా। రా శంకరవినుతనామ రాఘవరామా ॥ ౨ ॥

గోపాల జాలలోలా। భూపాలా భక్తపాల బుధజనపాలా। గోపాల కనకచేలా। రాపాతకనాశ యీశ రాఘవరామా ॥ ౩ ॥

శ్రీవిష్వక్సేనుల మది। సేవించెద మత్కృతిత్వ సిద్ధికి భక్తిన్। శ్రీవనితామణిఁ దలచెద। రావే నను కరుణఁబ్రోవ రాఘవరామా ॥ ౪ ॥

నామదిఁ బారాశర్యుని। నేమంబున సన్నుతించి నిర్మలముగ నీ। నామామృతంబు గ్రోలెద। రామా సుగుణాభిరామ రాఘవరామా ॥ ౫

చారుతరంబుగ కవితన। వారితముగ నాదు కవిత వర్ధిలవినయం। బారనుతియింతు బుధులను। రారా ద్విజారిభీమ రాఘవరామా ॥ ౬ ॥

నీకుఁదగు నుతికిఁ జాలరు। నాకులు యక్షులును సిద్ధనాథులు సురగుల్। నాకు నినుబొగడఁ దరమే। తా కమలా కలిత శ్యామ రాఘవరామా॥ ౭॥

ధరణీశయ నీకుఁ దగుగతి। ఫణిపతియు బృహస్పతియును భాషాపతియుం। బ్రణుతింపఁజాలరెన్నఁగ। రణధీరానాకువశమె రాఘవరామా॥

గంగను గడిగినఁ బంకము। రంగమరఁగఁ దొలఁగుపగిది రఘువర నిన్నున్। పొంగుచు నుతియొనరించెద। రంగా దుష్కృతముఁదొలఁగు రాఘవ రామా॥౯॥

నానుడుల నెరసులున్నను। నీనుతి పావనతఁ గూర్చు నిర్జరనదిలోఁ। స్నానము కల్మషమణఁచదె। నానావిధ భక్తవరద నరవరరామా॥౧౦

మతిహీనుఁడు త్వత్కథయని। హితమందక తప్పులెన్న నేమికొదువయా। నతిఘనముగ బుధులెంచరె। ప్రతినత జన రత్నధామ రాఘవ రామా॥౧౧॥

పతితజనపావనుఁడవీ। వతిదురితంబును హరించి త్వద్దాస్యంబున్। సతతముఁ గృపదనర శత। క్రతువినుతా యొసఁగు వరద రాఘవరామా॥

మతిలో దివమును రాత్రియు। నుతియింపఁ
గఁ గరుణసేయ యార్జితగతిశ్రీ। పతినీపదములఁ
బట్టితి। వ్రతముగ నవకముల దామ రాఘవరామా॥
కోరికలు గోరఁజేసియు। పారెకునాప్పించఁ
డగునె సదయుఁడవనినిన్। జేరితి నను రక్షింప
వే। ధారాధర నీలదేహ దశరథరామా॥౧౪॥
ఘోరములగు పాతకములు। నేరుపుతోఁజే
సినాను నేరము లెన్నన్। పారము పట్టఁగఁ జాల
ను। సారసదళనేత్ర సకలజననుత రామా॥౧౫
మోసము దోసము దొలఁగఁగ। వాసిగ సం
తాపభరము వదిలించు కృపన్। డాసిని కరుణ
కుఁ దగుదును। భాసుర సుగుణాభిరామ భవహ
ర రామా॥౧౬॥
అంతంబున యమకింకరు। లెంతయు భయ
మొదవఁ బట్టి యీడ్చెదరని నీ। చెంతకుఁ జేరి
తిఁ బ్రోవు దు। రంతము నా దురిత మెన్న రా
ఘవ రామా॥౧౭॥
కన్నడఁ జేసిన కతనఁబ్రి। సన్నులగతిఁ గాన
లేక బడలితి కడునా। పన్నుల నెందఱిఁ బ్రోచి
తి। క్రొన్నన రక్షోవిరామ రాఘవరామా॥౧౮
అల హార్ద బ్రిహ్మేంద్రాదుల। నెలవుల పైఁ

గాంతను లేదు నెమ్మదిలోనన్। వలనొప్పఁగ నిను
నమ్మితి। లలితంబుగనన్నుఁబ్రోవు రాఘవరామా॥
తావక పదవనజంబులు। భావంబున గుదురు
కొలిపి పరిపరిగతులన్। సేవింతు వరము నీయ
వె। సేవకజన దురితహరణ సీతారామా॥ ౭౦॥
చిల్లరదైవంబుల మును। తెల్లంబుగఁ గొలిచి
ముక్తి లేదనువేళుఁగని నా। కల్లలను బూటకంబు
లు। పల్లదములు బాపివేలు రాఘవరామా॥
భవదీయ దాసజనులకుఁ। బ్రవిమలముగదా
సులైన భక్తులనెల్లన్। సవినయముగఁ బూజిం
చెద। రవివంశ పయోధిసోమ రాఘవరామా॥
పలినవారలువిన్నప। మాలించకయున్న మా
కు నన్యులుగలరే। పాలించు భక్తవరదా। లా
లితవర రంగధామ రాఘవరామా॥ ౭౩॥
బంధుబు భ్రాతలటంచును। నందంబుగ సుతు
లటంచు నాప్తులటంచుం। గొందలమగు సంసా
రా। కిందన మెడఁబాపు కరుణ రాఘవరామా॥
దేవేంద్ర పదవియందును। భావంబునవాం
ఛ లేదు పాతకమెడలన్। తావక దాస్యమెకో
రెద। రావణసంహారవీర రాఘవరామా॥ ౭౫॥
దైవము తల్లియుఁదండ్రియు। భావింపఁగనో

దరులును బంధులు మిత్రుల్ । నీవనితలచెద ని
రతము। శ్రీపిలసిత కనక చేల సీతారామా ॥౨౬

పాపము పుణ్యము నీవని। మోపితి నీయందు
భరము ముదమలరఁగనే। నోపను జన్మాదులకిఁక।
శ్రీపరమపదేశ యీశ సీతారామా ॥౨౭॥

గర్భనరకమున కోడెద। దుర్భావముతోలఁ
గఁ దొడరు దుర్దశ లెడలన్। నిర్భరముగ దశ
రథ రుచి। రార్భక నను బ్రోవు కరుణ రాఘ
వ రామా ॥౨౮॥

వ్యాకులతరమగు సంసృతి। రాకలపోకలకు నో
పరక్షింపఁదగున్। నీకారుణ్యమె కోరితి। శ్రీకా
మఫలప్రదాత సీతారామా॥౨౯॥

పాపాత్ములఁ గృపఁగాచిన। భూపాలాయశ
ముగలుగుఁ బుణ్యాత్ములన్। గాపాడ నేమిగలు
గును। శ్రీపార్థివపూర్ణసోమ సీతారామా॥

సంసారజలధిఁ గడపవె। కంసాంతక నీదుచ
రణకల్పమునశోక। ధ్వంసముగ సకలపాప। భ్రం
శము గావింప వయ్య రాఘవరామా ॥౩౧॥

నీకంటె సదయు లెవ్వరు। నాకంటెను పతితు
లెవరు నాథ యనాథన్। ప్రాకటముగ ననుఁ
బ్రోవుము। శ్రీకలితయశోవిశాల సీతారామా॥

నీకుసరివచ్చుదైవము। నాకలలోనైనలేఁడు
నమ్మితినెమ్మిన్। నీకెంత నన్నుగాచుట। శ్రీకరరా
జీవనేత్ర సీతారామా॥౩౩॥

పరవాసుదేవ కేశవ। కరివరదా కామజనక
కమలారమణా। గిరిధర మురహర హరిని। ర్భ
రముగనను కరుణఁబ్రోవు రాఘవరామా॥౩౪॥

నావంటిదీనజనముల। సేవకులనుగాఁగ ది
ద్దిచింతలుదీరన్। యీవే తావకదాస్యము। నీవే
నావిహితగతివి నిజముగ రామా॥౩౫॥

కరుణాసాగరుఁడందురు। కరుణనెచట దాచి
నావుకరుగవుగా నా। దురిత భరముఁబాపవుదు।
ర్భరభవమణఁగించి బ్రోవు రాఘవరామా॥

నావంటిపుణ్యహీనుల। నీవేరక్షింపవలయునీ
కన్ననారుల్। గావసమర్థులుగలరే। రావణదు
ర్మదవిరామ రాఘవరామా॥౩౭॥

చింతింపరాని పాపము। కొంతైననునీదుక
రుణఁగొనసాగినబో। సంతయురజమాసంసృతి।
భ్రాంతినిదొలఁగించు వరద రాఘవరామా॥

నేననఁగనెంతదావను। నానేరంబనఁగనెంత
నాథ యనాథన్। నీనెనరునకేఁదగుదును। శ్రీనా
గసుఖోపశయాన సీతారామా॥౩౯॥

పాపముఁ జేసితినంటిని। రాపుల కేనోర్వనంటి రహిమీరఁ గృపన్। చేపట్టి యేలుమంటిని। శ్రీపరమ నతాబ్ధిసోమ సీతారామా॥౫౦॥

నీవే నాగతి యంటిని। నీవే నను గావు మంటి నీ శంకెనోరున్। భావమునఁ దలఁపనంటిని। శ్రీవనచరపద్మమిత్ర సీతారామా॥౫౧॥

యమునికి జడిసెద నంటిని। యమలోకముఁ జూడ నోపనని యంటిని నా। భ్రమలెల్లఁ బాపుమంటిని। క్రమమొప్పఁగ నేలు మంటి రాఘవరామా॥

దీక్షవహించితి దినులఁ। బాక్షికతం బోర్వ నీవు పామరురాలన్। నాక్షేమము రయకన్నను। దక్షమతి యెవరుగలరు రాఘవరామా॥౫౩॥

నామనవి చిత్తగించవె। వేమారును విన్నవింప వెఱఁగుగ నుండున్। నామది నీపైనుంచఁగ। రామా బ్రతిమాలుకుందు రాఘవరామా॥౫౪॥

కలుములు శాశ్వతమా నే। పలుబాములనొందఁ జాలఁ బ్రస్తుతి చేతున్। చలమునను దగుదు నే శ్రీ। లలనేశా దురితనాశ రాఘవరామా॥౫౫॥

నేరుపు మదిలో నెఱుఁగక। కోరుటయే కాని నిన్నుఁ గోరఁగ నేలా। కారుణ్యపయోరాశివి। రారా కోరెదను చూడ రాఘవరామా॥౫౬॥

రామా రామా యనుచును। వేమారును బిలి
చిపిలిచి వేసారితి నీ। నామమునఁ బిలువఁ బలు
కవు। రామా దయ రాదె నీకు రాఘవ రామా॥

కలియుగమందలి మనుజులఁ। గలియఁగ రాద
నుచు రావో కరుణయె లేవో। యలుకో పలుకే ప
లుకవు। లలితసకలమునివినోద రాఘవరామా॥

పలుకవు పలుమఱుఁ బిలిచిన। నలుకకు నే నెంత
దాననల భక్తులలోఁ। గలపినను ముక్తి యనిమెడి।
లలనామణిఁ గూర్పు కరుణ రాఘవరామా॥౪౯॥

తల్లియుఁ దండ్రియు నేటికి। యిల్లును బంధులు
ను సుతులు హితవరులేలా। కొల్లలుగ దాస్యమొసఁ
గవె। ప్రల్లదములు వేయు నేల రాఘవరామా॥

తావక పదవనజంబులు। భావంబున సంఘ
టించి ప్రస్తుతి సేయన్। కావవె దూర్వాసునిము
ను। శ్రీవిలసిత దేవ భామ సీతారామా॥౫౧॥

కరిమకరితోడఁ బోరుచు। గరువంబునఁ గొ
న్ని యేండ్లు గడువ నలసటన్। వెరవు గని నుదలఁచి
నదు। ర్భరదుఃఖముఁ బాపితీవు రాఘవరామా॥

ముక్కినయటుకులు పిడికెడు। మక్కువ ద
నరారనొసఁగ మాకుఁ గొని పెం। పెక్కఁ గు
చేలునకిచ్చితి। గ్రక్కున సంపదయు ముక్తి రా

ఘవ రామా॥౫౩॥

నారాయణుఁడను పుత్త్రుని। సారము చెడియ
మునిపురికిఁ జనియెడు వేళన్। చీరినఁ గాచితజామి
ళ, శ్రీరాజితకీర్తిధామ సీతారామా॥౫౪॥

నీ పాదరజము సోకినఁ। బాపము చెడి ము
న్నహల్యభామా మణియై। పాపున గౌతముఁ
బొందదె। శ్రీపరమపవిత్రగాత్రసీతారామా॥

కౌరవులువలువలూలువఁగ। గారవమునద్రు
పదరాజ కన్యక వేఁడన్। చారుతర పటములొ
సఁగవె। శ్రీరాజిత భూషణాంగ సీతారామా॥

పగవానితమ్ముఁడనుచును। పగయెంతయు లే
క కరుణ భాసిల లీలన్। దెగక విభీషణు మున్న।
భ్రగవాహన కాచితివు రాఘవరామా॥౫౭॥

అసురులుసుధగొని నిను గని। కసిదొలఁగిసు
ధాఘటంబు కరమునవిడ నీ। వసమాన సుధను
సురలకు। రసికతదనరంగనీవె రాఘవరామా॥

సుందరముగదశరథవర। నందనుఁ డనసంభ
వించినటసి శైలంగ। పొందుగననుజులఁగలసిపు
రందరనుత వెలసితివు రాఘవరామా॥౫౯॥

వాటముగాను సుబాహుని। తాటకను వధిం
చి గాధితనయుఁడు పొగడఁగ। మేటిగజన్నముగా

చితి। రాట దోలఁగి మునులు చెలఁగ రాఘవ
రామా॥౬౦॥

పూతననినుబాలియించెడి। ఘాతుక మొదవం
గఁజాలుగరళమునోసఁగన్। చైతన్యముడిపి కా
చితి। శ్రితామరపాళి వరద సీతారామా॥

శకటంబై యొకదనుజుఁడు। వికటంబుగఁ బైని
బడిన వ్రేళ్లాలకొఱకై। నికటముదనరఁగ పదమునఁ
బ్రకటంబుగఁ గూల్చితివె రాఘవరామా॥౬౨॥

వేలుపులవగలుమాన్పఁగ। గాలైసుడి గానె
డుదైత్యగర్వంబెల్లం। దూలమెడఁబిసికి చంపవె।
లాలిత భవపాశనాశ రాఘవరామా॥౬౩॥

నేరుపు దనరఁగ మెల్లన। కోరికనినుబట్టి రో
ట గోపికగట్టెన్। గారవముగఁ గైకొనవే। శ్రీరా
జిత కీర్తిధామ సీతారామా॥౬౪॥

అసమానంబుగఁ గంసుని। కసిదనరిన దనుజ
తతిని ఖండించి వెసన్। పసమీఱఁగ నిర్జరుల
ను। రసికాగ్రణి మనిచినావు రాఘవరామా॥

మచ్ఛమవై సోమకుము। న[illegible]ంబుగ ద్రుం
చివైచి యమరగణంబుల్। మెచ్చం దెచ్చితి శ్రు
తులను। లచ్చిగలిగి సురలు వెలయ రాఘవరామా॥

మందర మంబుధిఁ గ్రుంగిన। నందుకు సుర

ల్లవెలువ నయ్యద్రికిని। వందనముగఁ గూర్మమ
గుచు పు। రందరనుతకుదురుగావె రాఘవరామా॥
దానవుఁడు భూమిగొనిచనఁ। బూనినపగమీ
ర లోకపుంజము గలఁగన్। వానిని కిటివై ద్రుం
చితి। శ్రీనారదవినుతనామ సీతారామా॥౧౮॥
పాపపు హిరణ్యకశిపుఁడు। కోపముగొని ప
ట్టిఁ బట్టికొని దండింపన్। రూపణఁచితి నరహ
రివై। ప్రాపుగఁ బ్రహ్లాదుఁ బ్రోవ రాఘవ
రామా॥౧౯॥
ఖేదము సురలకుఁ దీర త్రి। పాదావని వేఁ
డి బలిని ఫణిలోకమునన్। బాదుకొననిడిన వా
మన। శ్రీదశరథరాజ పుత్ర సీతారామా॥౨౦॥
శ్రీపరశురాముఁడనఁగను। భూపతులను సం
హరించి భువి కశ్యపునిన్। బ్రాపింపఁజేసి తఖి
లము। ప్రాపగుచు సురారిభీమ రాఘవరామా॥
దశరథ రాముఁడ వగుచును। దశకంధరుధ
రణిఁగూల్చి ధరణిజ సీతన్। దశదళు కొత్తఁగఁ
దెచ్చితి। రసికజనుల్ సంతసింప రాఘవరామా॥
ఖలుల హరించు తలంపున। బలరామాభిఖ్యఁ
దనరి పార్థివులలరన్। చలమున దనుజులఁ బలు
వుర। లలితంబుగఁ ద్రుంచితీవు రాఘవరామా॥

బుద్ధతను వెత్తి దైత్యుల। నిద్ధరఁబడఁద్రుంచి
వైచి హితవలరారన్। సిద్ధముగ మునుల దివి
జుల। రద్దుదొలఁగఁబ్రోచితీవు రాఘవరామా॥

కలికివయి కలియుగంబున। వలనొప్పఁగదా
నవులను వధియించి వెసన్। గలితముగ యశము
నొందవే। లలిత రమా హృదయలోల రాఘవ
రామా॥ ౭౫॥

శ్రీమత్స్య కూర్మ నాథా। శ్రీమద్వరహావ
తార శ్రీనరసింహా। వామనరామా రామా। రా
మా శ్రీబౌద్ధ కలికి రాఘవరామా॥ ౭౬॥

కరుణాపయోధి వంచును। కరిఁగాఁచితివం
చు మిగుల ఘనుఁడవటంచున్। వెరవున నిను జే
రితి దు। ర్భర భవ బంధములఁ బాపు రాఘవ
రామా॥ ౭౭॥

నీదాస్యంబొనఁ గూరిచి। సాదరముగఁ జేరఁ
దీసి సంపదలను నా। కాదరణఁ గలుగఁ జేయఁగ।
రాదా రణరంగభీమ రాఘవరామా॥ ౭౮॥

భాగవతజనుల సేవకు। రాగము పుట్టించు
మెపుడు రాజితలీలన్। భోగములు గోరఁ జేయ
క। శ్రీగజవరవినుత సామ సీతారామా॥ ౭౯॥

రామానుజ దేశికులకు। నేమంబున భక్తి స

ఫణిశయను నెవ్విధంబునఁ। బ్రణుతింతు ననఘ వశయంబు వాయు నటంచున్। వినుతించితి నతఁడవి జన। మణులారా ప్రాజ్ఞులార మాటికి మిమ్మున్॥౯౮॥

చారు కవీంద్రుల వినయం। బారఁగఁ బ్రార్థన మొనర్తుఁ బహువిధముల నీ। శ్రీరామ శతకమందున। తీరుగ నెరసులు హరింపఁ దిద్దుఁడి కరుణన్॥

కూరిమి లేని భార్యయును కోమల మించుక లేని మాటయున్। సారము లేని వంటకము సన్మతి లేని సహోదరుండు నా। చాగము లేని సద్వ్రతము సౌఖ్య మొనర్పఁగ లేని పుత్రుఁడున్। ధారుణిలో వృథా యభవ ధర్మ విదారణ ధర్మరక్షణా॥౯౬॥

హితవరి గాని భృత్యుఁడును నిష్ఠము దప్పిన వాని బ్రాపు న। తుకతుకము లేని మానసము కోరిన దీయఁగ లేని హస్తమున్। చతురత లేని హాస్యము సంతతి నొందఁగ లేని జన్మమున్। సతము నిరర్థకంబు గద సాగరబంధన దైత్యనాశనా॥



